# అలిశెట్టి ప్రభాకర్ కవిత

<u>*సంపాదకులు*</u>

**జయధీర్ తిరుమలరావు**

**నిజాం వెంకటేశం**

**బి. నర్సన్**

**నవతెలంగాణ పబ్లిషింగ్ హౌస్**

ఎమ్‌హెచ్ భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర,
హైదరాబాద్-20. ఫోన్ : 27660013



128649

అలిశెట్టి ప్రభాకర్ కవిత



**ప్రచురణ సంఖ్య : 1435**

**ప్రథమ ముద్రణ : జనవరి, 2013**

**ద్వితీయ ముద్రణ : జూలై, 2015**

**నవతెలంగాణ ముద్రణ : జూలై, 2017**

**వెల : ₹ 200/-**

**ప్రతులకు : నవతెలంగాణ పబ్లిషింగ్ హౌస్**

ఎమ్.హెచ్ భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్,
ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-20.
ఫోన్ : 040-27660013.

**నవతెలంగాణ పబ్లిషింగ్ హౌస్ బ్రాంచీలు**

హైదరాబాద్ - చిక్కడపల్లి , బాగ్‌లింగంపల్లి, (ఎస్.వి.కె.),
ఇ.సి.ఐ.ఎల్, నల్గొండ, హన్మకొండ, ఖమ్మం, కరీంనగర్,
నిజమాబాద్, మహబూబ్‌నగర్.

**ముద్రణ : నవతెలంగాణ ప్రింటర్స్ ప్రై లిమిటెడ్, హైదరాబాద్.**

# అలిశెట్టి ప్రభాకర్

## (12.1.1954 - 12.1.1993)

కరీంనగర్ జిల్లా జగిత్యాల జన్మస్థలం. మొదట ఆర్టిస్ట్‌గా ఎదిగాడు. ప్రారంభంలో పత్రికలకు పండగలు, ప్రకృతి, సినీనటుల బొమ్మలు వేసేవాడు. తరువాత జగిత్యాలలో సాహితీ మిత్రదీప్తి సంస్థ పరిచయంతో కవిత్వరంగంలోకి ప్రవేశించాడు. 1974లో ఆంధ్రసచిత్ర వారపత్రికలో వచ్చిన 'పరిష్కారం' అచ్చయిన మొదటి కవిత. జీవిక కోసం జగిత్యాలలో 'స్టూడియో పూర్ణిమ' (1976), కరీంనగర్‌లో 'స్టూడియో శిల్పి' (1979) హైదరాబాద్‌లో 'స్టూడియో చిత్రలేఖ' (1983) ఏర్పాటు. జీవిక కోసం ఫోటోగ్రాఫర్‌గా, జీవిత పోరాటంలో కవిగా ఎదిగాడు. ఏనాడూ సంపాదన కోసం ఆరాటపడలేదు. తన కళ ప్రజల కోసమే అని చివరకంటా నమ్మాడు. ఎర్ర పావురాలు(1978), మంటల జెండాలు, చురకలు (1979), రక్తరేఖ (1985), ఎన్నికల ఎండమావి (1989), సంక్షోభగీతం (1990) సిటీలైఫ్ (1992) అచ్చయిన కవిత్వ సంకలనాలు.

తండ్రి స్వర్గీయ అలిశెట్టి చినరాజం. తల్లి లక్ష్మి. సహచరి భాగ్య. కుమారులు సంగ్రామ్, సంకేత్‌లతో హైదరాబాద్‌లో నివాసం.

# అలిశెట్టి స్వీయ ప్రకటన

మధ్య తరగతి కౌగిట్లోని మాధుర్యం కూడా తరిగిపోయి
పరిపరి విధాల మానసిక వేదనతో పాటు
పెరిగే ఇద్దరు పిల్లల భారాన్ని మోయటమెలాగనే ఆరాటం

మందులు కొనుక్కోలేని నిర్భాగ్యపు నగరంలో
మళ్ళీ మళ్ళీ ఊపిరితిత్తుల్లో క్షయ రాజుకోవటం
పరిపాటయిపోయింది.
పుట్టిన గడ్డనుంచి ఇక్కడికి రావటమే పొరపాటయి
పోయింది.

వాస్తవానికి – అవసరానికి నన్ను వినియోగించుకున్న
వాళ్లే నాపై జాలీ నోటులా జాలి కురిపించి
కుళ్లిన ఆసుపత్రిలా పక్కన జేరి పరామర్శించినా
నానించి ఏమీ ఆశించని వాళ్లే నాకెంతగానో
సహకరించారు.
'ఐసోనెక్స్' నుంచి 'సైక్లోసెరిన్' వరకూ ఉచితంగా
మందులందించిన మహానుభావులెందరో ఉన్నారు.

# ప్రచురణకర్తల మాట

**ఈ** పుస్తకం మలి ముద్రణ కాపీలను అమ్మకానికి ఇచ్చేందుకు తెచ్చిన నర్సన్‌గారు ఓ కాపీని కాంప్లిమెంటరీగా ఇచ్చారు. దాన్ని ఇంటికి తీసుకువెళుతుంటే అదేం పుస్తకం సార్ అని అడిగాడు ఓ విద్యాధిక నిరుద్యోగ యువకుడు. ఇది కవిత్వం, అలిసెట్టి ప్రభాకర్ కవితలు, చాలా బావుంటాయి చదువు అని ఇచ్చాను. కవిత్వం నేను ఏమీ చదవలేదు సార్ ఎలా ఉంటుంది అని అప్పటి వరకు కాంపిటేటివ్ ఎగ్జామ్స్‌కు ప్రిపేరయ్యే పుస్తకాలు మాత్రమే పరిచయమున్న ఆ యువకుడు అన్నాడు. చదివి చెప్పు అని ఇచ్చాను. చాలా పెద్ద పుస్తకం కదా, ఎన్ని రోజులకు పూర్తయితే అన్ని రోజులకు ఇస్తాను అని తీసుకున్నాడు. కాని ఆ పుస్తకాన్ని ఒక్క ఊపులో చదివి మరుసటి రోజునే తిరిగి ఇస్తూ కవిత్వం అంటే ఇలా ఉంటుందా సార్, చాలా బావున్నాయి. కవిత్వం అంటే అర్థం కాని భాష, అంతుచిక్కని విషయాలు వుంటాయని అనుకున్నాను. వీటిలో మన గురించి ఉంది. మన చుట్టూ వున్న ప్రపంచం గురించి ఉంది. మనం ఏం చేయాలో, ఎలా చేయాలో ఉత్తేజపరిచే రీతిలో, ఉత్సాహపరిచే రీతిలో వుంది. కవిత్వం ఇంత తేలిగ్గా ఉంటుందా అంటూ తన సంతోషాన్ని, సంతృప్తిని వ్యక్తం చేశాడు. కవిత్వం ఇంత తేలిగ్గా అర్థమవుతుందా అనే మాట, సామాజిక శ్రేయస్సు కోసం, సమాజ పరివర్తన కోసం, సమస్త కష్టజీవుల దృష్టితో రాసిన శ్రీశ్రీ, నెరూడా మొదలైన వారి కవిత్వానికి అన్వయించినట్లుగానే ప్రభాకర్ కవిత్వానికీ అన్వయిస్తుంది.

ఇలాంటి ప్రయోజకరమైన పుస్తకాన్ని పాఠకలోకానికి అందించే అవకాశాన్ని నర్సన్‌గారు, ఇతర ప్రభాకర మిత్ర బృందం నవతెలంగాణ పబ్లిషింగ్‌హౌస్‌కు కల్పించారు.

తరచు కలుస్తుండే నర్సన్‌గారు ఓ రోజు మాట్లాడుతూ, ప్రభాకర్ కవితల పుస్తకాల కాపీలన్నీ అమ్ముడు పోయాయి. ఎంతోమంది కవిత్వాభిమానులు, బుక్ సెల్లర్స్ మళ్ళీ ప్రింటు చెయ్యమని అంటున్నారు. కాని ఈసారి ప్రచురణ బాధ్యతను ఏదైనా ప్రచురణ సంస్థకే అప్పగించాలని అనుకుంటున్నామని అన్నారు. అలా అయితే మేం ప్రింటు చేస్తాము, మాకివ్వండి అని చెప్పాను. ఆయన దానికి వెనువెంటనే అంగీకరించి, ఈ పుస్తకానికి కాపీ రైట్ హోల్డర్లయిన ప్రభాకర్ కుటుంబ సభ్యులతో మాట్లాడి అనుమతి కోసం అన్ని ఏర్పాట్లు చేశారు. ఫలితంగానే అద్భుత ప్రజాదరణ పొందిన, పొందుతున్న 'ప్రభాకర్ కవిత' మళ్ళీ పాఠకుల ముందుకొచ్చింది. ఎప్పటి మాదిరిగానే ఈ ముద్రణను కూడా పాఠకులు ఆదరిస్తారని ఆశిస్తున్నాము.

హైదరాబాద్, **– గుడిపూడి విజయరావు,** ఎడిటర్

**తేదీ : 01-06-2017.** నవతెలంగాణ పబ్లిషింగ్‌హౌస్

## మలి ముద్రణ మాట

# అలిశెట్టి కవిత్వం తెలుగింటి ఉమ్మడి ఆస్తి

**త**న కళ్ళముందున్న ప్రపంచాన్నుంచి కవితార్హమైన వస్తువును నిక్కచ్చిగా ఏరుకొని భావాన్ని గుండెల్లో గుచ్చుకునేలా, చెంప చెళ్ళుమనేలా సూటిగా పేల్చడమే అలిశెట్టి ప్రభాకర్ కవిత్వ లక్ష్యం. ఆ పంథాలో ముందుకు సాగి క్రమంగా పరిపుష్టమైన రూప సార కవిత్వాన్ని సైతం సాధించి తెలుగు కవిత్వంలో తాను ఆశించని, ఊహించని స్థానాన్ని పదిలపరుచుకున్నాడు. తెలుగు కవిత్వానికి పాఠకలోక పరిధిని ఇంతగా విస్తృతపరచిన కవి ఆయన తరానికి మరొకరు లేరు. నేడు ప్రభాకర్ కవిత్వానికున్న ఆదరణ తెలుగు కవిత్వానికే ఓ ఆభరణం.

దాదాపు రెండు దశాబ్దాల పాటు నివురుగప్పిన ప్రభాకర్ కవిత్వం మళ్ళీ వెలుగులుజిమ్మాలని చేసిన ప్రయత్నం విస్ఫోటనం సృష్టించింది.

వేయి కాపీల తొలి ముద్రణ ఏ మూలకు సరిపోలేదనడానికి ఎన్నో దృష్టాంతాలు. మచ్చుకు ఒకట్రెండు.

నిర్మల్ నుండి ఓ బస్ కండక్టర్ 'ప్రభాకర్ పెద్ద బుక్ కావాలె. ఎప్పుడొస్తది' అని నెలకోసారైనా ఆరా తీస్తాడు. "ప్రభాకర్ సంపుటి నాక్కావాలి! అరే లేదంటే ఎలా! ఓ కాపీ చూడు నానా!" అని అనునయిస్తాడు సాహితీ పిపాసి అయిన తెలుగు హాస్యనటుడు. జిరాక్స్ కాపీ అయినా దొరికిందని సంతృప్తిపడే ఓ గేయ రచయిత. ఈ అక్షరాలు కూర్చుతున్న సమయంలో రాజమండ్రి నుండి ఓ పరిశోధక విద్యార్థి వాకబు.

పోయినేడు పదోతరగతి తెలుగు, ఇంటర్ ద్వితీయ భాష వాచకాల్లో అలిశెట్టి ప్రభాకర్ కవితలు పాఠ్యాంశం కావడంతో రెండు తెలుగు రాష్ట్రాల విద్యార్థుల, అధ్యాపకుల నుండి అలిశెట్టి సాహిత్యం కోసం ఒత్తిడి.

"తాజ్ మహల్ నిర్మాణానికి రాళ్లెత్తిన కూలీలెవ్వరు!" అన్న శ్రీశ్రీ ప్రశ్నకు జవాబుగా నిలిచిన –

'పాలరాతి బొమ్మైనా / పార్లమెంటు భవనమైనా

వాడు చుడితేనే శ్రీకారం / వాడు కడితేనే ఆకారం' అనే 'దృశ్యం' కవితలోని ప్రభాకర్ పంక్తులు నేడు పాఠ్యాంశంలో భాగం కావడం గమనార్హం.

ప్రభాకర్ జయంతి–వర్ధంతి సందర్భంగా జనవరి, 2013లో దీని తొలి ముద్రణ, జనవరి, 2014లో ఆయన కవితా చిత్రాలతో 'అక్షర నక్షత్రమ్మీద..." విడుదల, జనవరి. 2015లో జగిత్యాలలో ప్రభాకర్ శిలా ప్రతిమ ప్రతిష్ఠాపనకు తోడ్పాటు, ఈ క్రమంలో రెండో ముద్రణకు కాలహరణ జరిగిందని సర్దుకున్నా, నిజానికి లేటుగానే ఇది సాకారమైంది.

గోడ మీద వేలాడుతున్న అలిశెట్టి ఫోటోకేసి–ఈ పూటకు బియ్యమున్నాయిలే... నీ రాతలేవో రాసుకో అంటూ ఆయన తల నిమురుతున్నట్లు చూసే భాగ్యకు ఈ ప్రచురణలు ఓ ఊరట. బతికుంటే మా పక్కన కూచొని ఎన్ని చెణుకులు విసిరేవాడివోనని వేలుకొసతో కంటి తడిని ఆరబెట్టుకునే మాకు భుజానికెత్తుకున్న బాధ్యత. అలిశెట్టి ప్రభాకర్‌కు సంబంధించిన ఏ కార్యానికైనా నేను సైతం ఉన్నానని గుర్తుంచుకోండి సుమీ అనే మిత్రులు మాకు సైదోడు.

జగిత్యాల మిత్రులంతా మారన్నంలా ప్రభాకర్ కవిత్వం కోసం వేచియున్నారన్న అలిశెట్టి రాజు (A.V.N. రాజు, టీచర్).

తెలుగులో ఇంత సులభంగా అర్థమయ్యే కవిత్వం ఉందాని విస్తుపోయిన (రచయిత భాస్కరభట్ల మిత్రుడు) . జనార్థన్, విశాఖపట్టణం.

1984లోనే ప్రభాకర్‌ను B.H.E.L దవాఖానాలో చేర్చి, ఆయన బ్రతుకు కోసం తండ్లాడిన సాహితీమిత్రులు T. N. స్వామి మరియు G. నాగేంద్రరావు.

ఆరో తరగతి చదువుకునే రోజుల్లోనే "సిటీ లైఫ్"ను మరవకుండా చదివి, నేటికీ తన గుండె గూటిలో ప్రభాకర్ పట్ల అభిమానాన్ని భద్రంగా దాచుకున్న D.L.N. రెడ్డి.

ప్రభాకర్ ఆశించినట్లు– 'ఈ శిథిల ప్రపంచాన్ని పునర్నిర్మించే ప్రతి విద్యార్థికి' ఆయన అక్షరాలు చేరువవ్వాలని ఆకాంక్షతో మా భుజం తట్టిన వీరికి కృతజ్ఞత చిన్నమాట.

చివరగా – ప్రభాకర్ అక్షరాల్ని అందుబాటులో ఉంచడానికి మా ప్రయత్నం కొనసాగుతుంది. పేరుకు మేం ముందు కనిపించినా మా వెనక ఎందరో మిత్రుల ప్రేమ. ఈ దశగా మరింత కార్యాచరణతో ఎవరు ముందుకొచ్చినా మేముంటాం తోడుగా.

ప్రభాకర్ ఏ ఒక్కరి సొత్తు కాదు. ఆయన తెలుగు కవిత్వపు ఉమ్మడి ఆస్తి.

**- అలిశెట్టి మిత్రులు**

## తొలిముద్రణ యాది

# తూర్పుకు నీ పేరు పెడతాం....

**ఆ**కాశం లోతుల్లోకి చూస్తూ, చేతివేళ్లను ఒకదానికొకటి నిలువునా రాపిడి చేస్తూ, ప్లాస్టిక్ పట్టీల చిన్న కుర్చీలో కాళ్లు దగ్గరగా ముడుచుకొని కూర్చొని, కవితా శిల్పాన్ని ఊహల్లో చెక్కుతూ అలిశెట్టి ప్రభాకర్, ఇప్పటికీ స్టూడియోలో అడుగుపెడితే కనిపిస్తాడేమోననిపిస్తుంది.

ప్రభాకర్ మాకు కవికన్నా స్నేహితుడిగానే మిన్న. నికార్సయిన మనిషి. సచ్చా దోస్త్. దొంగలం.... కొడుకులసలే మెసిలే ధూర్తలోకం లోంచి వెళ్ళిపోయిన మరో కొంపల్లె జనార్ధనరావు.

ప్రభాకర్ అలకబూనితే మిత్రులకు ఊపిరాడేదికాదు. కట్టె పుల్లలలాంటి చేతులూపుకుంటూ వెళ్లిపోతుంటే చూస్తూ ఊర్కోవలసిందే. మామూలు అయ్యాక తనే వచ్చి కలిసిపోయేవాడు. కోపం వచ్చిందంటే మాత్రం మెరుపంత వేగం, అంతే సమయం. పర్యవసానం ఏమైనా కానీ... చటాక్ మాంసం లేనోడికి ఇంత తెగింపా అనుకునేవారంతా.

ఆయనకు తెల్లవారడమంటే ఉదయం పది తర్వాతే. తినక తప్పదనుకుంటేనే తిండి. తనకు తెలియకుండానే పోయేది నిద్ర. మన షెడ్యూలు జీవితాలు ఆయన వేలు పట్టుకొని ఒక్కరోజూ నడవలేవు. పారిపోవల్సిందే.

జగిత్యాలలో స్టూడియో పెట్టేదాకా అనగా 1973–76 మధ్యకాలం ప్రభాకర్ దిన జీవితమంతా బి.స్ట్రీట్‌లోనే, సాహితీమిత్ర దీప్తి నడిపిన నర్సన్, గంగాధర్, ధరన్ బాబులతోనే గడిచేది. వీరికి తోడు చాయ్‌లు, సిగరెట్లు ద్రవ, వాయు మిత్రులు.

ఆయన లెక్కన తెల్లవారగానే రాత్రంతా పొదిగిన చిట్టి పొట్టి కవితలు బిలబిలమంటూ వస్తుంటే, వాటెనుక ప్రభాకర్, దార్లో వాళ్ల పెద్దక్క ఏం పెట్టిందోగాని కాలర్‌తో మూతి తుడుచుకుంటూ వాలేవాడు.

అటునుండి పయనం పోస్టాఫీసుకు. ఓ చేత తిరుగుటపా అందుకొని, మరో చేత కొత్త కవితలను బాక్సులో వేయడం తప్పని దినచర్య.

ఆ రోజుల్లో కవులంటే పేరున్న కొందరే. కావ్య లక్షణాలకు పెద్ద పీట వేసే పత్రికలు ప్రభాకర్‌ను రాచి రంపాన పెట్టినా సాన పట్టాయి. ప్రభాకర్ మాత్రం కష్టజీవి జెండాను, ప్రతిఘటన ఎజెండాను దింపకుండా తనదైన శైలిలోనే ముమ్మందుకు సాగి లేనివాడి కవిగా, ఉద్యమకవిగా ఆ పత్రికల ద్వారానే గుర్తింపు పొందాడు.

ఇంటర్మీడియట్ కూడా పూర్తి చేయని ప్రభాకర్‌కు తెలిసిన విద్యల్లా అందరికీ తెలిసిన వాడుక పదాలనే తన కవిత్వంలో వాడడం, ఆ పదాలలోని అక్షరాలతోనే గారడీ చేసి అద్భుతమైన కవిత్వాన్ని రగిల్చి ఎగదోయడం. ఈ పరుసవేది కనికట్టు పండిత కవులను సైతం విస్మయపరచి ఎవరీ ప్రభాకర్ అని ఆరా తీసేలా చేసింది. అసంఖ్యాక సామాన్య పాఠకులకు ఆయన అభిమానకవి అయ్యాడు.

ప్రభాకర్ గురించి ఎక్కడ మాట్లాడినా ఆయన పుస్తకాల లభ్యత గురించి ప్రశ్నలు ఎదురయ్యేవి. పత్రికల్లో, పుస్తకాల్లో ప్రస్తావనార్థం వచ్చిన కవితాంశాలే తప్ప పూర్తి కవిత్వం చూడలేక పోతున్నామనే ఆవేదన వ్యక్తం చేసినవారెందరో. ప్రభాకర్ కవిత్వం మొత్తం ఒకే పుస్తకంగా వస్తున్నదని అయిదారేళ్ళుగా వినడమేకాని కనడం జరుగలేదు. ఈ ఎదురు చూపులు భరించలేక మనమే అలిశెట్టి మిత్రులుగా ఎందుకీ ప్రయత్నం చేయకూడదనిపించింది. అలా మొదలైన నిజాం వెంకటేశం సంకల్పానికి బి. నర్సన్ కదలిక తేగా, దాసరి నాగభూషణం, వి.సామ్రాట్ అశోక్‌కుమార్, గుండేటి గంగాధర్‌లు చలో కానీయ్ అని సైదోడు పలకగా నేను సైతం అంటూ దీవి సుబ్బారావు చేయి కలుపగా, జయధీర్ తిరుమలరావు నేనున్న కదా అని కంటిచూపుతో ఇచ్చిన ధీమా ఇలా కార్యరూపమైంది.

కాలం గడుస్తూ ప్రభాకర్ మరణించి ఇరవై ఏళ్లయింది. ద్విదశాబ్ది వర్ధంతినాడు ఆయనకు యాది దీపం పెట్టి పదిమంది కలసి స్మరించే వేళ – 'అలిశెట్టి ప్రభాకర్ కవిత' విడుదలే నిజమైన నివాళి.

**- అలిశెట్టి మిత్రులు**

**జగిత్యాల / హైదరాబాదు**

# తాను మరణించి జనులకి  కవితనందించి...

**3**7 ఏళ్ళ కింద కవిత్వం ఆరంభించినవాడు. 34 ఏళ్ళ క్రితం పరిచయమైనవాడు. ఇరవై ఏళ్ళ కింద మరణించినవాడు.

పేద కానివాడు,  కాని పేదరికాన్ని ఆహ్వానించినవాడు. అనారోగ్యగ్రస్తుడు కానివాడు, కాని ఆరోగ్యాన్ని చేజేతులా పోగొట్టుకున్నవాడు.

స్వీయ జీవితాన్ని మండించి సమాజానికి వెలుగులు అందించినవాడు.

బాధితుల పక్షాన అక్షరాలను సాయుధం చేసినవాడు. కష్టజీవులకోసం రాసినవాడు. జల్సా జీవితం గడుపుతూ కవిత్వం రాస్తే ప్రజలు నమ్మరని విశ్వసించినవాడు. సొంత ఆస్తిపై మమకారాన్ని విడిచి, దానిని చేతులారా విడిచిపెట్టినవాడు. తినడానికి పావుసేరు బియ్యం లేకున్నా వచ్చిన మిత్రులకి టీతో ఆతిథ్యం అందించినవాడు.

ప్రేమిస్తే స్నేహాన్ని పండించి, ద్వేషిస్తే మొహం పక్కకు తిప్పుకుని తన మానాన తన కవిత్వం రాసుకున్నాడు.

కుటుంబాన్ని ప్రేమించినా డబ్బుని కామించనివాడు. బాధ్యత గుర్తెరిగినా  సరిపడా నెలసరి  డబ్బు కోసం ద్వంద్వ ప్రమాణాలు పాటించనివాడు. ఉద్యమాలు చేసి హీరోలుగా, నేతలుగా ప్రవర్తించేవారు నాలుగుతరాలు హాయిగా బతికే ప్రణాళికలు రచిస్తున్న వేళ పిచ్చిగా కవిత్వం రాసుకున్న అమాయకుడు.

అతడి పేరు అలిశెట్టి ప్రభాకర్.

అతడు నిత్య కార్మికుడు. పనిచేస్తేనే పొట్టగడిచేది. ఎంత పని చేసినా రోజులు గడిచాయి కాని పొట్ట పూర్తిగా నిండలేదు. అలా నిండలేదని తప్పు పని చేయలేదు.

కవిగా సంక్రమించిన గ్లామర్ ఇల్లు గడవడానికి పనికి రాలేదు. కవిత్వాన్ని ప్రేమించే చాలామందితో దినాలు, వారాలు గడిపి రోజువారి సంపాదన లెక్క చేయలేదు.

ఏ పూలమొక్కయినా దాని రుతువులో లెక్కలేని పూలు పూస్తుంది. కాని ఈ బక్కచిక్కిన కలం కవిత్వం తప్ప జీవితాన్ని పూయించుకోలేదు. ఇష్టపడి ఇంటికి తెచ్చుకున్న భాగ్య కూడా అమాయకలోకమే. కుంచెతప్ప, కలం తప్ప, కెమెరా లెన్సుని

తప్ప కాసులని కదిలించలేని బతుకు అతనిది. కుంచెకు రంగులు, కలానికి సిరా, కాగితం, కెమెరాకి ఫిలిం–అన్నీ ఖర్చులే.

పైపెచ్చు ప్రయాణాలు. అతని జీవితం అరసంచార స్వభావం. కరీంనగర్, జగిత్యాల మధ్య అతని జంటపాదాలు ఏనాడూ ఒక్కదగ్గర నిలవలేదు. సంక్లిష్ట సమాజంలో జీవితం కొందరికే 'స్థిరత్వం' కల్పిస్తుంది. హైదరాబాద్‌లో అడుగుపెట్టిన నాటి నుండి సొంత ఇంటినే చిరునామాగా కలిగి ఉండేంత ఆర్థిక స్వావలంబన ప్రభాకర్ వంటి వాళ్ళకు లేదు. దాన్ని కూడా వ్యక్తి తప్పుగా భావించే కుహనా విప్లవవాదులు ఉన్న కాలం.

జగిత్యాలలో సొంత ఇల్లు, తల్లి, సోదరుడు ఉన్నా, స్టూడియో పూర్ణిమ నడుస్తున్నా కరీంనగర్‌లో 'స్టూడియో శిల్పి'కి మారాడు. కొన్ని మారడాలకి, మార్పులకి కారణాలు అంతుపట్టవు.

ప్రభాకర్‌ని కొందరు పెద్దలు, మిత్రులు వద్దని, కరీంనగర్‌కు మారవద్దని హెచ్చరించారు. బతుకు బాధలు, అభాగ్యత ప్రమాదాన్ని వివరించారు. ఐనా వినలేదు. కవిగా ఎదగడానికి వలస రాలేదతను. స్టూడియో వ్యాపార రీత్యా మకాం మార్చలేదు.

అక్కడ ఆనాడు జరుగుతున్న పోరాటంలో ఉడతాసహాయం అయినందుకు మారాడు. పోరాటమే మనిషిని ఆత్మగౌరవ కేతనం చేస్తుందని నమ్మాడు. తన లాంటి వాళ్ళకు ఒక గుండెదిటువు అని విశ్వసించాడు. మంచి పనికి తన వంతు సహకారం ఆనతి ఇచ్చాడు. అందుకే అతని ఇల్లు 'మిత్రుల'కి నీడనిచ్చింది. వర్షంలో వస్తే గొంగడి అయ్యింది. చలిలో వస్తే తేనీరయ్యింది. ఎండలో వస్తే గొడుగు అయ్యింది. ఆకలితో వస్తే కంచమై పరుచుకుంది. రోగంతో వస్తే ఆస్పత్రి పడకై సపరిచర్యలు చేసింది.

డబ్బు ఖర్చు కావలసిందే. మంచి పని కోసం ఖర్చు కావడం ఆనందం. కాని ఆదాయం లేని ఖర్చు ఎంతకాలం. పైగా నీడలే జాడలు చెప్పే రోజులు. అలల కలలపై నిఘా. ప్రభాకర్ కవి. కలగనడం అతని ప్రవృత్తి. కలగనని కలం విప్లవ కవిత్వం రాయలేదు. రాయడం ఆపిన కవిలో కలలు కనేశక్తి ఉడిగిందని అర్థం. ప్రభాకర్ మరణించే వరకు స్వప్నిస్తూనే ఉన్నాడు. ఏదో ఓ రోజు తనలాంటి వారి దీనజీవితాలకు మార్గం దొరక్కపోతుందా అనే ఆ ఎదురుచూపు.

అందుకే తన ఇంటిని యుద్ధశిబిరం చేశాడు. అందుకు ఎలాంటి చింతలేదు. కాని కరకుబూట్ల శబ్దం నిశ్శబ్దమై ఇంటిని పహరా కాస్తుందని తెలుసుకోలేదు. ఓ రోజు రాత్రిపూట కరీంనగర్ బజార్లో నడిచిపోతున్నప్పుడు లాఠీలు ఆ బక్కపలచని అతన్ని శరీరాన్ని కుమ్మేసాయి. స్టూడియో శిల్పి చేతికి గాయం. మనసు పరాజయం. ఏం చేయాలో తెలియదు. అప్పుడు హైదరాబాద్‌కి పయనమయ్యాడు. అలా వెలిసిందే విద్యానగర్‌లోని స్టూడియో చిత్రలేఖ. పదిమందికి మాత్రమే ఉపయోగపడే కవిత్వంతో అతని భావసంఘర్షణ

తృప్తి చెందలేదు. బృందాలు మాత్రమే ఆనందించే కవిత్వానికి కొత్త పాఠకవర్గం కావాలి. అందుకోసం ఏం చేయాలో అని ఆలోచించాడు. సంఘర్షించాడు.

## 2

భౌతికంగా శరీరం 'మార్చ్' చేయని చోటుకు తన కవిత్వాన్ని వారికి శిరస్త్రాణంగా చేసి పంపాలనుకున్నాడు. అందుకే ముసలి కవిత్వరూపం కాదని యువధాతు రూపం కల్పించాడు. మినీ కవిత్వం ఉద్యమమై దానినే కవిత్వంగా భావించి కేవలం వ్యక్తిగత భావాలకే ప్రాధాన్యత ఇస్తూ రాస్తున్న సందర్భంలో చిన్న రూపం 'చురకత్తి'గా, అతి పెద్ద భావనని ప్రతిఘటనగా రాయడం మొదలుపెట్టాడు. తన కవితని కవిత్వపెద్దల కోసం కాదని నిర్ణయించుకున్నాడు. కవిత్వం భారీ కాయంతో సంస్కృత పదభూయిష్టం, సంక్లిష్టభావార్థం, సర్కస్ ఫీటుతత్వం వంటి వాటిని నిరాకరించి సులభంగా అర్థమయ్యే తెలుగు పదాలు, స్పష్టంగా గుండెని చేరే ఇన్‌స్టంట్ భావాలు, జీవితంతో అనుబంధించే ఘర్షణంతా అతని కవితల్లో చేరాయి.

రాను రాను ఈ కవితలూ మరింత పఠనయోగ్యతకోసం పరితపించాయి. కేవలం అక్షరాలే కాదు కొన్ని దృశ్యాలతో యువపాఠకులకు దగ్గరగా వెళ్ళాలనుకున్నాడు. కుంచె బొమ్మల్ని, కెమెరా బంధించిన ఫోటోల్ని తన కవిత్వానికి ఆసరా చేసుకున్నాడు. తాను చెప్పే భావాన్ని వెలిగించే దివిటీలుగా మార్చుకున్నాడు. తన కవిత్వం అక్షరాలతో వాటిని ఒక సృజనాత్మక పటంగా మార్చాడు. నిజానికి వాటిని ముద్రిస్తే "పోస్టర్ కవితలు" అవుతాయి. ఆ ఖర్చు పెట్టలేక కవితలతో వందల చార్టులు తయారు చేసి 'కవిత్వ ప్రదర్శన' ఏర్పాటుకి శ్రీకారం చుట్టాడు. కవిత్వ సమ్మేళనాల్లో కవిత్వం చదవడం మొదలు కాగానే సభలోంచి జనం పారిపోయే కాలంలో ప్రభాకర్ కవిత్వ ప్రదర్శనకి విద్యార్థి, యువకులు ఉసిళ్ళ వలె మూగేవారు. చాలామంది నగర కవులకు ఇది ఆగ్రహం తెప్పించింది. ఇది కవిత్వాన్ని పలచన చేయడమే అని అన్నారు. అది కవిత్వం కానేకాదని అన్నారు. ప్రభాకర్ ఎవరినీ లెక్కజేయలేదు. తన పనిలో తాను నిమగ్నమై పోయాడు. తెలుగు నేలలో చాలా చోట్ల కవితా ప్రదర్శన జరిగింది. ఒక గొప్ప సంచలనం. సంక్లిష్టత బిగికౌగిలిలో చిక్కిపోయిన కవిత్వానికి వ్యతిరేకంగా ఒక కొత్త శకం మొదలైంది. ఒక కొత్త పాఠకవర్గం తయారు అయ్యింది. ప్రభాకర్‌లా నేనూ రాయగలననే భరోసా యువకవులకి వచ్చింది. తెలుగు కవిత్వానికి ఇది ఒక సరికొత్త పునర్నవకాలం.

ఒకవైపు అనుభూతి కవిత్వం, మరోవైపు వ్యక్తివాద కవిత్వం పోటీలు పడుతున్న వేళ అది. అభ్యుదయ కవిత్వం చివరి వెలుగుతో, విప్లవ కవిత్వం యాంత్రికతతో బాధపడుతున్న సమయం. ప్రజలు పోరాటం చేస్తుంటే వాళ్ళ కుటుంబాలు అనూహ్యమైన

బాధలకు గురవుతున్నాయి. జీవితాలకు హామీలేదు. అప్పుడు పేదరికంలోంచి మరింత పేదరికానికి, బాధలనుండి మరిన్ని బాధలకి, కన్నీళ్ళనుండి అష్టకష్టాలలోకి దారి తీసినా చెదరని విశ్వాసాన్ని కనబరిచిన సమాజాన్ని తన కవితావస్తువుగా చేసుకుని ప్రభాకర్ కవితలు రాశాడు.

ఈ పరిస్థితుల్లో కుటుంబ సభ్యులు పెరిగిన కొద్దీ, ఖర్చు నెత్తిన పడ్డకొద్దీ ప్రభాకర్ జీవితం అతలాకుతలం కాజొచ్చింది. జగిత్యాలలోని ఇంటిని అతి తక్కువ ధరకి అమ్మేసి అప్పులు తీర్చాడు. ఐతే రానురాను టీబి వ్యాధి శరీరాన్ని క్షీణింపజేస్తుంటే మందులు, వైద్యం కోసం ఖర్చు పెచ్చు పెరిగిపోయింది. మిత్రుల సహాయం ఏమాత్రం సరిపోని పరిస్థితి ఎదురైంది.

హైదరాబాద్‌లో ఆర్థిక పరిస్థితి కన్నా సాహిత్య వాతావరణం అతడిని నిలువనివ్వలేదు. విపరీతమైన రాజకీయాలు, సూటిపోటి మాటల వల్ల అతని సున్నితమైన మనస్సు బాధకు గురైంది. తన సహభావచరులు అతడిని తప్పుపట్టడం మరింత బాధకు గురిచేసింది. తనని తప్పు పట్టడం భరించలేపోయాడు. తప్పుపట్టే వారిలోని ద్వంద్వ ప్రమాణాలను నిరసించాడు. హాయిగా బతుకుతూ, బతుకుకి ఏమాత్రం ఢోకా లేకుండా చూసుకుంటూ మరోవైపు పైకి విప్లవం అనడం భరించలేకపోయాడు. విప్లవ ఆశయాలకోసం ఆస్తిని, తనువుని, కుటుంబాన్ని లెక్క చేయకుండా తపించే తనని తక్కువ చేయడం వల్ల కొత్త మిత్రులకోసం అర్రులు సాచాడు. తనలోని సంఘర్షణ తగ్గించుకోవడం కోసం ప్రతి చిన్న అవకాశాన్ని, స్నేహహస్తాన్ని ఆసరా చేసుకోవాలనుకున్నాడు. అలా గొప్ప స్నేహశీలతను చివరికంటా కాపాడుకున్నాడు. ఇన్ని మంచి లక్షణాలున్న వాడుకూడా ఆరోగ్యాన్ని కాపాడుకోలేకపోవడం బాధకలిగించే విషయం. రోజు రోజూ అనారోగ్యం తినిపారేస్తున్నా దాన్ని లెక్కపెట్టక పోవడం చిరాకు వేసేది. అది వైద్యులను, స్నేహితులను కలిచివేసే విషయంగా మారింది. ఎంతమంది ఎన్ని మంచి విషయాలు చెప్పినా ఎందుకనో తన నిర్ణయం మార్చుకోలేదు. తన జీవితకాలాన్ని నిశ్శబ్దంగా హరిస్తున్న రోగాన్ని పక్కనపెట్టి కవిత్వం గురించే మాట్లాడ్డం విచిత్రంగా అనిపించేది. కవిత్వంతో చావుని గెలవాలనుకున్న పిచ్చివాడు. గెలుస్తానని నమ్మినవాడు. నిజానికి ప్రభాకరే గెలిచాడు. చావు ఆకవిత్వమై తోకముడిచింది. ప్రభాకర్ మరణానికి చాలా కోణాలు కనుపిస్తాయి. కారణాలు కొన్ని బలంగానే ఉన్నాయి.

తగినంత భావనాశక్తి, సరైన భావజాలం ఉండి దాన్ని పాఠకులకి సులభంగా చేర్చే సంక్షిప్త భాషా పటిమ కలిగిన ప్రభాకర్ తన బలం కవిత్వమే అని నమ్మాడు. దానినే ఆయుధంగా చేసుకున్నాడు. దానినే నమ్ముకున్నాడు. చివరి రోజుల్లో 'సిటీలైఫ్' కవితల పారితోషికం మీదే జీవించాడు. ఎన్నో అముద్రిత, ముద్రిత కవితలను

దాచుకోలేకపోయాడు. ఎప్పుడూ ఇండ్లు మారే పరిస్థితి. తన రచనలు అచ్చయిన పత్రికలు కూడా కొనలేని దీనత్వం. రాసి పత్రికలకు పంపితే పత్రికలు అచ్చువేయపోవడం ప్రభాకర్‌ని కలచివేసిన కొన్ని అంశాలు.

తన సాహిత్యానికి మౌఖికంగా ప్రచారం చేసింది ఎమ్వీయల్ ఒక్కడే. ఆంధ్రజ్యోతి దిన పత్రికలో ఆరేళ్ళుగా 'సిటీ లైఫ్' పేరుతో సుమారు 1425 కవితలు రాశాడు. అందులో 418 కవితలను 'సిటీలైఫ్' పేరుతో 1992లో అచ్చు వేశాడు. ఆ 'కాలమ్' చదవని ఆంధ్రజ్యోతి పత్రికా పాఠకుడు ఉండేవాడు కాదు. సీరియస్ భావాలని, సామాజిక దృక్పథంతో రంగరించి పాఠకులకు చేరవేయడంలో ప్రభాకర్ విజయం సాధించాడు.

1990 ప్రాంతంలోనే "ఏ దేశం సిరసు మీద / మోపిన / పాదాలైనా / హోదాలైనా / సామ్రాజ్యవాదాలే" అని రాశాడు. అప్పటికి వామపక్ష పార్టీ కవులు కూడా ఇంత స్పష్టంగా చెప్పలేదు. ప్రభాకర్ క్రాంతదర్శిత్వానికి ఇదొక మచ్చు తునక. అప్పట్లోనే ఒక ప్రగతిశీల కవి పైరవీతో ప్రభుత్వ సంస్థ పురస్కారం పొందిన వేళ దానిని నిరసిస్తూ " అర్భకుడైన కవి ఒకడు / అవార్డులూ / సన్మానాల కోసం / దేబిరించడం తప్ప / నగరంలో నేడు / అవాంఛనీయ / సంఘటన లేవీ జరుగలేదు" అని రాశాడు. సాహిత్య లోకంలో కనిపించిన ఆ ధోరణిని ఆనాడే స్పష్టంగా ఖండించాడు. ఆ అవార్డు గ్రహీత ప్రగతిశీల రంగంతోరాసుకుని పూసుకుని ఉంటాడని కూడా తెలుసు. అలాంటి వాడు ఎంతటివాడైనా అర్భకుడే. అందుకే ఈ పెడధోరణిని కవిత ద్వారా పాఠకులకి తన అప్‌డేట్ చేశాడు. ఒక కళాకారుడి మీద హత్యాయత్నం జరిగినప్పుడు చలించిన ప్రభాకర్ – " గొంతు కోస్తే / పాట ఆగిపోదు / అది.... ముక్తకంఠం / గొలుసులేస్తే / పోరు నిలిచిపోదు / అది... ప్రజాయుద్ధం" అని రాశాడు. ప్రభుత్వం వైపు మొగ్గు చూపిన కవిని తెగిడి ప్రజల తరపున నిలచిన పాటని పొగిడిన ప్రభాకర్ ఏవైపో తెలుసుకోవచ్చు. అవార్డు కవి ప్రభాకర్ జీవించినంత కాలం కోపంతో రగిలిపోయాడు. ఐనా తాను బతికి ఉన్నంత కాలం అలాంటి వారికి వెరవలేదు. ఇవ్వాళ క్లిష్ట దశలో ఉన్న తెలంగాణ ఉద్యమం ప్రభాకర్ ఉంటే ఎంత బాగుండేదో అని అనిపిస్తుంది. ఎంత గొప్ప కవిత్వం రాసేవాడని?

## 3

అలిశెట్టి తానెప్పుడు కవిగా ఫోకస్ కావడానికి ఇష్టపడలేదు. మినీ కవితా ఉద్యమంలో చొరబడలేదు. ప్రగతిశీల కవిగా బోర విరుచుకోలేదు. సన్మానాలు, సత్కారాల కోసం వెంపరలాడలేదు. అవును. ఇతరులు తన కవిత్వం అచ్చేసుకుని పుస్తకాలు తెచ్చినట్టు, ఆవిష్కరణ సభలు పెట్టుకున్నట్లు గానే అలిశెట్టి మాత్రం కవితా ప్రదర్శన మాత్రం ఏర్పాటు చేసుకున్నాడు. అందుకోసం ఎన్నో కష్టాలు పడ్డాడు.

ఆర్థిక కారణాల వల్ల తన పుస్తకాలనెప్పుడూ చౌకగానే అచ్చు వేసుకున్నాడు. వాటిని అమ్మి డబ్బు సంపాదించాలని భావించలేదు. చాలా వరకు ఉచితంగా పంచేవాడు.

అతని కవితలు ఎక్కువగా నోటి నుండి నోటి ద్వారా ప్రచారం అయ్యాయి. నాలుగు చరణాల్లో లోగడ కవులెవరూ చూడని లోతులను చూపాడు. సామాజిక భావనలను ఎర్రపావురాలు చేసి ఉద్యమాకాశంలోకి ఎగరేశాడు. తన బతుకుని క్షయ వ్యాధికి తినబెట్టి తన కవితాలోకానికి కానుకగా అందించాడు. సొంత ఆస్తి మిగుల్చుకోకుండా ఉన్న ఆస్తిని కవిత్వానికి హారతి చేశాడు.

ప్రభాకర్ వంటి కవి మరొకడు పుట్టడం కష్టం. అలాంటి కవిత్వం రాయడం కూడా కష్టమే. తన జీవిత కాలమంతా భావవిస్తృతి, ఇతివృత్త వైవిధ్యం కోసం కృషి చేశాడు. కవితా రూపాన్ని కూడా మార్చడానికి సాహసించాడు. పాత కవిత్వ రూపాన్ని నిరాకరించి సులభశైలితో తీర్చిదిద్దాడు. కళాశాలలే అతని, కవిత్వ ప్రచార కేంద్రాలు. యువతరాన్ని చైతన్యవంతుల్ని చేయడానికే ఎక్కువగా పాటు పడ్డాడు. నిరంతరం విస్తరించడమే ఆశయంగా పని చేశాడు. తాను విశ్వసించిన భావాలను నలుగురికి చేరడానికి కొత్త విధానాల గురించి ఆలోచించే వాడు.

చాలా మంది కవులను తన కెమెరాలో బంధించాడు. స్టూడియో నడిపినా డబ్బుల కోసం సాహిత్య సభల ఫోటోలు తీయడానికి ఇష్టపడేవాడు కాదు. తనదైన వ్యక్తిత్వం కాపాడుకుంటూ, గౌరవాన్ని పొందడానికే ఇష్టపడేవాడు.

'సిటీ లైఫ్' పుస్తకానికి రాసిన ముందుమాటలో పెద్దగా చదువుకోని వాడు రాశాడంటే ఎవరూ నమ్మరు. చక్కని శక్తివంతమైన వచనానికి గుర్తు అది. మూడు నాలుగు పేజీలలో తన జీవిత చరిత్రని రాసిపెట్టుకున్నాడు.

చిన్న కవితలలో ఎంత ముద్రవేశాడో పెద్ద కవితలు కూడా అంత బాగా రాయగలడు. తన ప్రతిభాసామర్థ్యాలు ఈ కవితల్లో మనకి కనిపిస్తాయి. నేలమీద పురుషులతో సమానమైన, సగం అయిన స్త్రీల గురించి కవికి చాలా గౌరవం. చాలా కవితల్లో వారి గురించి రాశాడు. 'వేశ్య' కవిత తెలియని కవి ఉండడంటే అతిశయోక్తి కాదు. మరో కవితలో "నువ్వీ నాగరిక ప్రపంచంలో / స్పృహ / కోల్పోయినంత కాలం / నీ చీర – వెండితెర / నీ పైట – ప్రకటనల కాన్వాసు / నీ ప్రేమ – రాసలీల" కాబట్టి జాగ్రత్త. చీర, పైట, ప్రేమలు అనే మూడు పదాలతో మహిళ జాగ్రత్తగా ఉండాలని సూచించాడు "ఎవరమ్మా నువ్వు" అనే కవితలో –

రాతి హృదయంలో ఇమడని అశ్రు పుష్పంలా జాతి గుండెల్లో రగిలే శోక దీపంలా ఎవరమ్మా నువ్వు – అని ప్రశ్నిస్తాడు.

'విషాద సాక్షాత్కారం ' కవితలో అశ్రు బిందువు నుంచి స్త్రీకింకా విముక్తి కలగలేదు" అని బాధ చెందుతాడు.

## 4

సామాజిక మార్పుని నినాదాల రూపంలో కాకుండా జీవితకోణాలను, దానికి కారణమైన రాజకీయార్థిక రంగాలలోంచి దర్శించాడు. అతని ప్రతి కవిత్వ చరణం వాస్తవికతతో తొణికిసలాడుతుంది. విషాదాన్ని చెప్పినా దానికి కారణాల్ని కూడా ఎత్తిచెప్పేవాడు. విషాదాన్ని జయించే ఆలోచనా శక్తిని కూడా జత చేసేవాడు. అందుకే ప్రభాకర్ కవితకి అంత ప్రచారం. చాలామంది కవితలు చదివి పాఠకులు మరిచిపోతారు. కాని ప్రభాకర్ కవిత పాఠకులని వెన్నాడుతుంది. తిరిగి తిరిగి మననం చేసుకునేలా వెంటాడుతుంది. ఈ లక్షణం ప్రభాకర్ మరణించి రెండు దశాబ్దాలు దాటినా కవులు సాధించలేకపోయారు. అందుకే చాలామంది ప్రభాకర్ కవిత్వం ఎక్కడ లభిస్తుందని అడిగేవారు.

నిజానికి అలిశెట్టి మరణించకపోయి ఉంటే తెలుగు కవిత్వం మరింత కొత్త పుంతలు తొక్కి ప్రజల తరపున ఆయుధం అయ్యేది.

అనుభూతి, భక్తి, ముక్తి, సరసం, వినోదానికి పరిమితమైన పాఠకుల మనసులను ప్రగతిశీల ఆలోచనా దృక్పథంలోకి మళ్ళించగలిగినవాడు ప్రభాకర్.

ఈ విధానం వేగిరవంతం చేస్తున్న కాలంలోనే అతని రోగం ముదరడం ఎక్కువైంది. రోగాన్ని విస్మరించి కవిత్వలోకంలో ఎక్కువగా విహరించడం చేసేవాడు. ఒకప్పుడు ఆర్థిక భాధ ఆ తరువాత రోగగ్రస్తం అయిన శరీరబాధ అతడిని క్రమశిక్షణ లేనివాడిగా తయారుచేసాయి.

విద్యార్థులు, యువకులు, కవులు, రచయితలు, పాత్రికేయులు, ఫోటోగ్రాఫర్లు, చిత్రకారులకు అతను తలలో నాలిక. ఎవరైనా వచ్చి తమ బాధలు అతనితో పంచుకునేవారు. నేనున్నానులే అనే ఆశ్వాసం ఒకటి వారికి ఉండేది. దానిని పెద్దలు కొందరు తప్పుగా అర్థం చేసుకున్నారు. మనిషికోసం మనిషి అనే తపన ఉండడం తప్పుకాదు. ఈ పెద్దలు పట్టించుకోని తావులలో అలిశెట్టి నేనున్నానని విస్పష్టం చేసేవాడు.

వివిధ జిల్లాల నుండి హైదరాబాదు నగరానికి వచ్చిన వాళ్ళకి చిత్రలేఖ ఒక అడ్డా. నగరంలో పలకరించే ఒక దిక్కు. ఏదైనా పని కోసం సలహా ఇచ్చే కేంద్రం. బాధలు విని మనిషిగా ప్రతిస్పందించే మానవతాకుటీరం. వారికి ఓ కప్పు చాయి తాగించి, ఆకలైతే టిఫీను పెట్టించి లేదా వారితో తాను ఇంత తిని కొంత సమయం వారితో గడిపేవాడు. 'మిత్రుల'కి కూడా అప్పుడప్పుడు కొన్ని పనులు చేసిపెట్టేవాడు. వారంటే ప్రభాకర్‌కి అమితమైన ప్రేమ. వారి త్యాగాలంటే ఆకర్షణ. వారి నిబద్ధతకు సెల్యూటు. తన హృదయానికి తగిలే నులివెచ్చని స్పర్శ అది.

ఐనా వారి నుండి ఎలాంటి అదనపు సహాయం ఆశించేవాడు కాదు.

రాను రాను ప్రభాకర్ శరీరం కుంగిపోతుంటే పొగని, ద్రవాన్ని, కోపాన్ని దూరం చేసుకోలేకపోయాడు. జీవితం చివరలో ఆత్మ సమీక్ష జరుపుకున్నా ఆలస్యం అయిపోయింది చాలా.

తెలిసి తెలిసి చావుని ఆహ్వానించడం కన్నా ఏమీ ప్రభాకర్ చేయలేకపోయాడు. చూస్తూ చూస్తూ మృత్యువొడిలోకి కూరుకుపోతున్నా చూస్తూ స్నేహితులు చేసేదేమీ లేకపోయింది.

తన జీవశక్తిని కోల్పోతున్నా కవిత్వ శక్తికి మాత్రం దూరం కాలేదు. మరణం నా చివరి చరణం కాదని రాసుకున్న ఏకైక ఆధునిక కవి.

అతనొక మనిషి

అతనొక కవి.

అతడొక కవిత్వ మాంత్రికుడు.

కుంచెని, కెమెరా లెన్సుని, కలాన్ని ఏకం చేసి తెలుగు కవితకు పుష్టి చేకూర్చాడు. రెండు దశాబ్దాల కింద మూగబోయిందతని శరీరం. కానీ కవిత్వం మాత్రం గోడలపై నినాదాలై, వ్యాసాలకు మొదలు తుదలై, ప్రజల నోటి నుడికారమై మన మధ్యే తచ్చాడుతున్నది.

శ్రీశ్రీ తరువాత అంత ఎక్కువగా 'కోట్' అయిన కవిత్వం ప్రభాకర్‌దే. వర్తమాన కవిత్వానికి 'కాయినేజ్' పెంచిన కవీ ఇతనే. రూపంలో సంక్షిప్తతనీ, వస్తువులో జీవిత విస్తృతినీ, సమాజపు లోతుల్నీ ఇమిడ్చాడు. సమాజ మార్పులని అకాంక్షిస్తూ పేదరికానికి బలైన కవి. 'మరణం నా చివరి చరణం' కాదని, సమరమే తన అంతిమ చిరునామా అని ప్రకటించాడు. రోజు రోజుకీ అతని కవిత్వానికి రెలవెన్స్ పెరుగుతోంది.

ప్రభాకర్ పునర్జన్మ అతని కవిత్వమే.

మనిషిగా మరణించవచ్చు. కవిగా మరో నాలుగు జన్మలు పొందగలిగిన సత్తా ఉన్నవాడు!

ప్రగతిశీల కవిత్వం పలచనైనప్పుడు, చాలామంది కవులు రంగం నుండి పరారవుతున్నప్పుడు, కవిత్వం. మానేసి ఇతర క్షేత్రాలకు వలసపోతున్న క్షణాన అలిశెట్టి నేనున్నానని మీ ముందుకు వస్తున్నాడు.

అతని భావజాలంతో, దృష్టి కోణంతో, కవిత్వ మాధ్యమంతో ఈ కవిత్వ సంకలనం ద్వారా షేకాడిద్దాం. రండి.

**2 జనవరి 2013**

**హైదరాబాదు** **- జయధీర్ తిరుమలరావు**

# విషయసూచిక

# తలపోత

అర్ధంకాని నా కవితాక్షరాల్ని అప్యాయంగా నిమిరి
అప్పుడప్పుడు ముసిముసిగా నవ్వుకునే మా అమ్మ
లక్ష్మికి...

ముళ్ళడొంకలాంటి నా బతుకు మీద మురిపాల
పూలుపూచి నా కన్నీటి తెరమీద కమనీయ దృశ్యమైన
నా భాగ్యానికి...

అడక్కుండానే తన రక్తమిచ్చిన ఆప్తురాలు సూరంపూడి
లక్ష్మికి, అపారమైన అభిమాన ధనమిచ్చి ఒక దశలో
నన్నాదుకున్న పాత్రికేయులకూ ...

నా జీవితం మీద ఎనలేని మమకారం పెంచుకున్న
నా ప్రాణమిత్రులకు
వినమ్రంగా
ఒకసారి చేతులెత్తి నమస్కరిస్తున్నా ...

- అలిశెట్టి

# ఎర్ర పావురాలు

## 1

గుండె నిండా బాధ కళ్ళనిండా
నీళ్లున్నప్పుడు
మాటపెగలదు కొంత సమయం కావాలి.
దట్టంగా కమ్ముకున్న విషాద మేఘాలు
చెల్లాచెదురై
హృదయం నిర్మలాకాశం కావడానికి కొంత
వ్యవధి కావాలి.
భారమవుతున్న ఉచ్ఛ్వాస నిశ్వాసల మధ్యే
మృత్యువును పరిహసించేందుకు ఒకింత
సాహసం కావాలి.
ఉండి ఉండీ ఉధృతమయ్యేందుకు
ఉద్వేగభరితమైన సన్నివేశం కావాలి......

## కవితల క్రమం

# ట్రీట్‌మెంట్

ఇండియా గుండెల మీద
స్టెతస్కోపు పెట్టి చూశాను
పరీక్షగా....
నగ్నంగా ఉన్న చెవుల శరీరాలకు
అగ్నిలా చురకలు తగిలిన
సెగల అలజడి నాలో....
ఇది రోగం కాదు ఘోరం.
ఇది పాపం కాదు శాపం.
ప్లీజ్.....క్విక్....
అందరూ ఒక్కొక్కరే
ముందుకు రండి.
చుక్కా చుక్కా కలిపి
చైతన్యం టానిక్ తీసుకురండి.
ఈ ట్రీట్‌మెంటే దీనికి కరెక్టు జడ్జ్‌మెంట్.
నేను డాక్టర్ని కాను బ్రదర్.
మీలోని అజ్ఞానం, సోమరితనం
బీడు భూముల్ని దున్నాలని
పరితపించే ట్రాక్టర్ని

## సమాధానం

వేదనతో
పండిన
గుండెను
పిండి
ప్రశ్నిస్తే
రెండు వైపులా
కన్నీళ్లు
మొండిగా
సమాధానం
చెబుతాయి.

## పెయింటింగ్

నీ లైఫ్‌ని
బ్యూటిఫుల్ పెయింటింగ్‌గా
మార్చుకోడానికి
అట్రాక్టివ్ కలర్ "రెడ్" కొరకు
రక్తం మాత్రం
ఎవరిదీ ఉపయోగించకు.

# బూడిద

"సౌందర్య సౌధం
కాలిపోయి, మిగిలిపోయిన
బూడిద"
ఆనాటి చరిత్ర
ఆ బూడిదలో పొర్లే గాడిదల్లా
మనకెందుకు ఇంకా
అవే జ్ఞాపకాలు
వద్దు వద్దు
అది వసూలుకాని పద్దు
దాన్ని అసలే కోరద్దు
వెదురు బొంగుల్లాంటి
ఈ బ్రతుకులకే
ఆ రంగు హంగులెందుకు?
నీ ముందున్న
కాలం ఇనుమును
నీ శ్రమతో కరిగించి
చక్కని శైలిలో మలుచుకో
సాధ్యమైనంత వరకూ

## "క్యూ"లో...

ఓ పేద దంపతుల
ప్రేమ చిహ్నానికి
కొన్నాళ్ళకి
ఓ చిన్నారి
కలిగిన పిమ్మట
వారి పరిస్థితి.....
అదివరకే
"క్యూ"లో
వత్తిగిలి చస్తున్న
ఇద్దరి మధ్యలోకి
జొరబడిన మరో మనిషిలా....

## దర్శనాలు

వందసార్లు
దేవుడి దర్శనం
చేసుకునే బదులు
ఒక్కమారు
గారడి ప్రదర్శన చూడు
అక్కడి వృధా మొక్కుల కంటే
ఇక్కడి ఒక్క ట్రిక్కన్నా
నీ మెదడ్లో కెక్కొచ్చు.

## నా తపస్సు

ఉండి ఉండీ
భరించలేక
గుండె రూంలోంచి
వేడిగాలి పై కెగసి
నిప్పు కళ్ళ వెంటిలేటర్స్ ద్వారా
భారంగా బయటపడి
కనపడని మంటలై
శూన్యపు సముద్రంలోపడి
అన్యమనస్కంగా మాసిపోతున్నాయి.
ఈ మంటలు
ఆరిపోవద్దని
కాలిపోవాలని
తపన...
తపస్సు...

## బ్యాండేజీ కట్లు

నీకు నీవే
గుడ్డిగా నమ్మి
మురిసిపోకు
భ్రమ చెందకు.

నీ దేశం
ఎన్నో ప్రగతి మెట్లెక్కిందని
ఒక్కమారు
ఈ దేశం దేహమంతా
నీ కళ్ళ కాళ్లతో గాలించి చూడు
అప్పుడైనా
తెలుసుకుంటావేమో...
అవి ప్రగతి మెట్లు కావు
కుళ్లిపోతే కట్టించుకున్న
"బ్యాండేజీ కట్లు"

## సమత కావాలంటే...

సోమరి తనానికి
బానిసై
బంధించబడిన
విలాసపు గాలులు
స్వతంత్రంగా వీచినప్పుడు...
ఈ వ్యవస్థను
అందంగా స్థాపించిన
మాట్లాడలేని చెట్లను
బిగ్గరగా అల్లుకు పోయిన
ఇనుప తీగల పట్టు సడలి
వాటిని వదిలినప్పుడు...

నా తల్లి గర్భంలో
పచ్చగడ్డి సమంగా మొలుస్తుంది.
ప్రతి ముంగిలీ
ముగ్గులతో నవ్వుతూంది.

## ప్రశ్న

సున్నితమైన
ఎన్నో పూలను
మేమే మోస్తున్నాం అని
విర్రవీగే కొమ్మల్లారా!
మిమ్మల్ని అనుక్షణం
కంటికి రెప్పలా కాపాడుతూ
మీకండగా ఉండేది ఎవరు?
కాండం
అది కూడా అలాగే
అపార్థం చేసుకుంటే
అహంభావం పెంచుకుంటే
ఎన్నాళ్ళనుంచో
మీ కోసమే త్యాగం చేస్తూ
అజ్ఞాతవాసం గావిస్తూ
అడుగునే పడి ఉన్న
వేళ్ళ మాటేమిటి?

## తారతమ్యం

ఓ చోట
ఖరీదయిన శవం
బ్రతికి అరుస్తోందింకా స్వార్థంతో...
నా దేహ దహన దాహం
గంధపు చెక్కల్తోనే
తీరుతుందని.

మరో చోట
కాలం గానుగ
తోలే పీనుగు
ఆఖరి మూలుగు.

## మినీ టానిక్

పిరికి...
పేరుకున్న
మురికి.
ధైర్యం....
మనిషికి
మరో వీర్యం.

## దర్పణం

*ఆశ....*
*విత్తనం లేకుండా*
*పెరిగిన మొక్క యొక్క*
*శ్వాస.*

*నిరాశ...*
*నాభి లేని ఊబిలో*
*దిగబడక ముందే పొందే*
*ప్రయాస*

## భయం

*బాంబుని*
*చూడగానే*
*బెంబేలు పడితే*
*అదెప్పుడూ*
*నీ గుండెల్లోనే*
*పేలుతుంది.*

# ఫలితమొక్కటే

గులాబి
ఏ కంట పడినా
అందాన్నే
ఒలక బోస్తుంది.
మల్లియ
ఏ ముక్కు పుటాలు
సోకినా
పరిమళమే అందిస్తుంది.
తేనె
ఏ నాలికను తాకినా
మాధుర్యమే
చవి చూపిస్తుంది.
కమ్మని స్వరం
ఏ చెవిని పాకినా
వీనుల విందుగా
మురిపిస్తుంది.
అమానుషం
ఏ మనిషిని
ఆవహించినా
భీభత్సమే జరిపిస్తుంది.

## నా కవిత

నా గుప్పిట్లో
మండుతున్న
ఎన్నో గుండెలు...
ఒక్కొక్కదాన్లో
దూరి,
వాటిని చీరి,
రక్తాశ్రువులు ఏరి
పరిశీలిస్తాను
నేను.

## వేశ్య

తను శవమై....
ఒకరికి వశమై...

తనువు పుండై...
ఒకడికి పండై....

ఎప్పుడూ ఎడారై...
ఎందరికో ఒయాసిస్సై.....

# చేయూత

నా చూపులు
శూన్యం అరణ్యంలో
చిక్కుకున్నాయి
నా అజ్ఞాత హస్తాలు
ఏదో రూపాన్ని
చెక్కుతున్నాయి.
వేళ్ళు రక్కుకు పోతున్నాయి.
క్రిక్కిరిసిన జనం తొక్కిడిలో
చిక్కిన చిన్న పిల్లాడిలా
హృదయం బావురుమంటోంది
ఇది... .అంతర్ఘోష
ఇది..........అందని శ్వాస
ఈ విపత్తు దాటి నే వెలిగిస్తే
విద్యుత్తు.
ఆ కనిపించే వెలుతురు
నా కవిత.
వర్తమానానికీ భవితవ్యానికీ నడుమ
ప్రగతి వంతెన కట్టాలని అనుక్షణం
పరితపిస్తున్నాను
అందుకోసం చైతన్యమున్న ప్రతి మనిషిని
దేహీయని అర్థిస్తాను
ఈ అడుగులోంచి, వేడిలోంచి
నా దేశాన్ని పైకిలాగమని ప్రార్థిస్తాను.
వారితో నేనూ కలిసి ప్రయత్నిస్తాను.

## వర్తమానం

దాదాపు
నగ్నంగా ఉన్న
వృక్ష ప్రపంచంలోంచి
చిక్కిన ఆకుల
శరీరాల్లోంచి
నరాల ఈనెలు
కొట్టొచ్చినట్టుగా
కనిపిస్తున్నాయి.

ఇది...
ప్రకృతి శిశిరం కాదు
సమాజ శిథిలం చూడు
అవి ఈనెలు కావు. ఈటెలు నేడు.

## మురికి చిత్రం

బూరుగు చెక్కల్లాంటి
బొొక్కలకు
ప్లాస్టిక్ కవరు
ప్యాకింగ్ వంటి దేహం.
పెంటకుప్పలా స్ఫురించే ఆ నెత్తికింద

రెండు గుహల్లో
వెలగలేని దీపాలు కళ్ళు.
అడవిలాంటి
మహా నగరాల్లో ఇలాటోళ్ళకి
లెక్క లేనన్ని చెట్లు ఇళ్ళు.
ఒక చిన్న నలుచదరపు
అల్యూమినియం బిళ్ళకోసం
కళ్ళ చేతుల్తోనే జోడించి
ప్రాధేయపడతాడు.
తన్నినా...పడతాడు.
ఏమీ అనలేక – కడుపులో
లుంగ చుట్టుకు పడుకున్న
పేగుల్ని తిడతాడు.

## గుండె

పడుకుని ఉన్నా
గుండె
గడియారమౌతుంది.
ఒక్కొక్కప్పుడది
నిద్ర పట్టనివ్వని
అలారమౌతుంది.

## సంతృప్తి

*నీ గుండె మీద*
*నా భావాల జెండా*
*నిటారుగా*
*నిలబెట్టినంత మాత్రాన*
*నేనెప్పుడూ తృప్తి చెందను.*
*నువ్వు వాయువువై*
*దానికి ఆయువు పోసినప్పుడు*
*నాకసలైన సంతృప్తి.*

## అంకురం

*దురదకూ*
*గోకుడుకూ*
*పుట్టేది కాదు విప్లవం.*
*ఎన్నాళ్ళనుంచో*
*పాతిపెట్టబడిన*
*రగిలే ఒక అగ్నికణం*
*తాళలేక ఒకనాడు*
*నెత్తురు విత్తనమై మొలకెత్తి*
*రేపటి సంగ్రామానికి*
*పెద్ద ఎత్తున*
*ఆయత్తమయే సత్తా.*

## సార్ధకత

ఎన్నో బీళ్ళున్నాయి.
వాటిపై
మరెన్నో మోళ్ళున్నాయి
కాసేపు
ఒక్క మోడుపైనైనా వాలి
పాడే పక్షివై నిలవాలి.

## అమీబా

ఎప్పటికప్పుడు
అమీబాలా
అస్తవ్యస్తంగా,
అఘోరించే రాజ్యాంగ రూపం.

మున్సిపాలిటీ వారు
చూడని,
మురికి కాలువలా
తయారైంది కాలం.

బహుశా – మళ్ళీ
మహమ్మద్ బిన్ తుగ్లక్
మందబుద్ధి చరిత్ర
మనకింకా బాకీపడి ఉందేమో !

ఎటొచ్చీ
చచ్చేదీ,
చచ్చి బ్రతికేది,
మధ్యతరగతి మనిషే!

## ఉదహరింపు

శిల్పం
చెక్కక ముందు
బండ.

శిక్షణ
పొందక ముందు
మొండి.

ప్రతిభ

వెనకాల

ఎంతో ప్రయాస.

సో...

కాలానికి

వదలకు భరోస.

## చిలుం

ఈ ధరిత్రి అంతర్భాగాన
అణువణువునా శోధిస్తూ,
తుప్పుపట్టిన అప్పటి రాజుల
కత్తుల్ని పట్టి, తుడిచి,
ఆ తరం మెరుపును
పరికించే ఓ మానవుడా...!
ఈ తరం, ఇదే ధరిత్రిపైన
ఆకలి చిలుము పట్టి,
ఎన్ని అస్తిపంజరాలు
కుళ్ళి, కృశించి పోతున్నాయో
నీ హృదయం మైక్రోస్కోపుతో
ఒక్కసారి పరిశీలించు.

## సహృదయం

ప్రతి
హృదయానికి
ఉంటాడొక వ్యక్తి.
కాని,
ప్రతి వ్యక్తికీ
ఉండదు హృదయం.

## కళ్ళు తెరవండి!

*బంజరు దొడ్లలోకి*
*పిల్లల్నింకా*
*తోలకండి! తోయకండి!*

*ముందు*
*నిరుద్యోగులకు బళ్ళు*
*తెరవండి! తెరవండి!*

*సభల్లో ఏం చేస్తున్నారు?*
*మా గుండె రభసల్లోకి*
*చొరబడండి! తొరపడండి!*

## కరువు

ఎండ ధాటికి
చిన్న చిన్న
నీటి గుంటలే
ఎండి పోతుంటాయి,
పెద్ద చెరువులు
'మాత్రం' మామూలే.

## నిర్మోహమాటం

దేవుళ్ళు తమ గుళ్ళకి రాత్రిళ్ళంతా
తాళాలు వేసుకుంటున్నారెందుకో
బహుశా మనుషుల మీద నమ్మకం పోయిందేమో.

ప్రజా నాయకులు తమని గెలిపించిన ఓట్లనే
ఇంకా లెక్క పెట్టుకుంటూ మురిసిపోతున్నారేమో
ప్రజాసేవకి అప్పుడే ఏమంత తొందరొచ్చిందని కాబోలు.

సినీతారలు వారి మర్మాంగాల్ని మనకు
'సభ్యత' ఎరుగక ప్రదర్శించటం లేదులే!
మాలోని బిగి ఇంకా సడలలేదని ఛాలెంజ్ చేస్తున్నారంతే.

ఇప్పుడే ఏం కొంప మునిగిందని యువతరం పైకిరావటానికి
వార్ధక్యం దాకా బోలెడు టైముందిగా
పాపం అందుకే బుడిబుడి అడుగేస్తున్నారింకా.

## హెచ్చరిక

*మా అభయమే మీ విజయం*
*మా సమరమే మీ కిరీటం*
*గుర్తుంచుకోండి!*
*మరిచిపోకండి!!*
*నిగ్రహంతో విగ్రహాన్ని ప్రతిష్టించింది*
*మాపైనే ఆగ్రహానికి కాదు.*
*ప్రస్తుతం*
*కోవెల వెలుపల కేవలం*
*కావలి కాస్తున్నాం.*
*కల్మషం లేక చూస్తున్నాం.*
*కనక వర్షం లాంటి కానుకకై కాదు.*
*కనీసం మీ కరుణ కోసం*
*పరితపిస్తున్నాం.*
*గుర్తుంచుకోండి!*
*మరిచిపోకండి!*
*సహజమైన సహనం మాలో ఉంది.*
*సాహసోపేతమైన గుణం మాలోనే ఉంది.*

# జాగ్రత్త!

జాగ్రత్త....
ప్రతి ఓటూ
ఒక ...నీ పచ్చినెత్తురు మాంసం ముద్ద
చూస్తూ చూస్తూ వేయకు ఏదో ఓ గద్దకి.
అది కేవలం
కాగితం మీద గుర్తుకాదు
జీవితం కింద ఎర్తు.
తూర్పో పడమరో నాక్కావలసింది
వెలుతురు అనుకోకు.
వెలుతుర్లను పంచే సూర్యుడే కావాలి
అందరం కలిసే తేవాలి.
అందుకోసం
ప్రతి శ్వాసా ఒక ధ్యాసగా మారాలి
ప్రతి అణువూ ఒక్కటై చేరాలి
ఈ నినాదాల పాదాల కింద
తొక్కుడుపడి పోకండి.
ఆ వాగ్దానాల వజ్రాయుధాలకు
బలి అసలే కాకండి.

## తేడా

రబ్బరు ముద్దల్లాంటి
మాంసం ఎత్తుల కోసం
రహస్యంగా చూపుల్తో
అన్వేషిస్తుంటాడు రసికుడు.

రహదారి మీద
తోలున్న అస్థిపంజరాలు
తటస్థిస్తే చాలు
మస్తిష్కంలోనే
నిలుపుకుంటాడు కళాకారుడు.

## అద్దం

అద్దంలో
నీ అందాన్నే
చూసుకుని మురిసిపోతే
అవివేకం.
అద్దంలోంచి
అవతలకీ ఇవతలకీ
పారదర్శకంగా చూడగలిగితే
వివేకం.

## సజీవీ!

కళ్ళున్నా
చూపు
చీకటికి
బానిసౌతుందంటే
ఒప్పుకుంటాను. కానీ...
సంకెళ్ళులేని
నీ చేతులు
అచేతనంగా
వాలిపోతే
నేనూరుకోను.

## దేశం కోసం

ఒకరాత్రి
నక్షత్రాలు
నా కళ్ళలోకి
చూస్తుంటే,
నేను నాలోకి
చూస్తున్నాను
నాగుండెతో
చెప్తున్నాను
నా దేశం

చిక్కని చీకటిలో
ఒక్క చుక్క 'చుక్క'నై
మెరవాలని ఉందని.

## ఆశయం

నే కష్టపడి రాసుకున్న
తీయని వాక్యాన్ని
ఎవరో ముక్కలు ముక్కలు
చేసి పారిపోయారు.
పదాలన్నీ
చిందర వందరగా
కిందపడి పోయాయి.
అక్షరాలెన్నో
విరిగిపోయాయి.
సమకూర్చుకోలేక...మళ్ళీ
సతమతమౌతున్నాను
కాస్తా నువ్వూ ఓ చేయి వేయి.

## నిజం

అడుగు తెలియని జీవితంలో
'నిజం'
ఎంత ఎక్కువగా తవ్వితే
అంత అమితంగా దొరికే
ఖరీదైన ఖనిజం

## సాధనే కావాలి

సంద్రంపై రంధ్రం చేయాలనుకున్నట్లు
నెరవేరని ఆశయాలకు,
పెనుగాలే భవితవ్యమని తెలియక
శ్రమించి నిర్మించుకున్న చదువు కుటీరాలకు,
కోర్కెల మార్కెట్లలో ఏమీ కొనలేని
నిర్భాగ్యపు జీవితాలకు,
చివరికి,
ఒయాసిస్సుల్ని సైతం కోల్పోయిన
ఎడారులకు కూడా...
నేనెప్పుడూ సానుభూతి చెప్పను
సాధనే చేయమంటాను.

## "వాడి" గుండెలో...

బజారులో
నిత్యావసర వస్తువు
వాడికి
అందని పాదరసం.
అందుకే
వాడి గుడిసెలో

కాదు కాదు
ఆ గుండె గదిలో
మండుతోంది భాస్వరం

## చరిత్ర హీనులు

బాటలెన్ని వేసినా, కోటలెన్ని కట్టినా
సొంత సంతకాలు పెట్టుకో (రా)ని వాళ్ళు.
సమాజం అంగడిలో సత్తావున్న వాళ్ళకి
చవగ్గా అమ్ముడు పోయిన వాళ్ళు వీళ్ళు.
కనబడకుండా, కాల ప్రవాహంలో
తమ నెత్తురునీ సత్తువనీ సహనాన్నీ
ధారబోసి దూరమైన వాళ్ళు.
తాము కొట్టుకుపోతున్నా ఎందరికో
పట్టుకోడానికి ఆధారమై మిగిలిన వాళ్ళు.
చిట్టచివరి వరకూ ఏమీ మిగుల్చుకోనివాళ్ళు!
శతాబ్దాల నుంచీ ఎవరో చేసే దోషాలను
నిశ్శబ్దంగా పూడ్చి పెట్టింది వీళ్ళే.
శవాల్లాంటి కరెన్సీ కట్టలకు
జీవాల్ని పోసింది వీళ్ళే
కూలే వీళ్ల సమాధుల్లో
పునాదులెందరో తోడారు.
పండే వీళ్ళ పంటల్లో
మొండిగా ఎందరో దోచారు.

దేశాల్ని చేసిన మనుషులు వీళ్ళు
దశల్ని మార్చేసిన మిషనులు వీళ్ళు
చరిత్రకి మెత్తని తివాసి పరచిన వాళ్ళు
దానికిందే చట్టుబండలై మరిచిన వాళ్ళు.

## ఉఛ్వాస

నువ్విప్పుడొక
విత్తనానివి
రేపు పూసే చిగురుకి
సరికొత్త ఊపిరివి.
మరి...
మొలకెత్తకముందే
అలసిపోయి
చచ్చిపోకు.
చచ్చిపోతూ
బలవంతంగా
మొలకెత్తకు.
లోలోపలే
సమాధివయితే
సయించదు మట్టికూడా
వెలుపలికి
కుతూహలంగా చొచ్చుకొస్తే
ఆకాశమంత ఎత్తునే చూస్తావు.

## రాళ్ళు

అనాది నుంచీ
నీ రంగుల మేడల పునాదులకు
ఆ కళ్ళు లేని రాళ్ళని
అవి నోళ్ళు లేని రాళ్ళని
పట్టపగలే
పట్టపగ్గాలేకుండా
పగుల గొడుతున్నావు.
ఆ రాళ్ళకీ కాళ్ళున్నాయి.
నిన్ను రక్కేసే గోళ్ళున్నాయి.
అప్పుడు నువ్వెంత
గొంతు చించుకుని అరిచినా
ఈ సమాజం
పెద్ద సౌండ్ ప్రూఫ్ గదిగా
మారుతుందని ముందే తెలుసుకో...

## న్యాయస్థానం

ఈ తరాని
ఈత రాని
నిరుపేదలకు
ఈ చట్టం
ఎత్తయిన నీటి మట్టం.

# సంఘర్షణ

హృదయమంతా
రుధిరమయమైపోయి.
నరాల స్వరాలు భాస్వరాన్ని
గుర్తుకి తెస్తున్నప్పుడు...
మనిషి
అచేతనంగా గాలికి కొట్టుకునే
కిటికీ రెక్కల్లాంటి వాడు కాడని
నిరూపించుకున్నప్పుడు....
ఎక్కడో అట్టడుగున
ఇంకా ఇంకిపోని చైతన్యం
ఊటలా ఉధృతమౌతున్నప్పుడు....
ఏ దానవత్వాన్నో ప్రతిఘటించినప్పుడు....
రహస్యాల తిమిరంలో
హేతువనే మొక్కలున్నాయని
తెలియని నీకళ్ళ వెనుక కళ్ళకి,
ఈ సుచరిత్రకి మురికి గీతల్లా
మిగిలిపోతాయని నాకైతే
ఖచ్చితంగా తెలుసు.
అందుకే అసలైన సువర్ణంలోంచి
మలిన వర్ణాన్ని సృష్టిస్తోంది.
కాలం..
కాదు లోకం.

# ప్లాస్టిక్ సర్జరీ

సిటి అంటే అన్నీ
బ్యూటీ బిల్డింగులు కావు
ఇది వెరైటీ సమస్యల మనుష్యుల
సమ్మేళన కోలాహలం
సొసైటీ స్ట్రీట్ లైట్ కింద
ఫాషన్ పురుగులు అందంగా
ఎగురుతూ మెరుస్తూంటాయి.
నైంటీపర్సెంట్, హృదయానికి
క్లోరోఫాం ఇచ్చి, మెదడును మాత్రమే
'లెటస్ గో' అంటుంటారు.
ఎంత చేసినా ఎవడికీ
తీరిక దక్కదు. కోరిక చిక్కదు.
మెర్క్యురీ నవ్వులు. పాదరసం నడకలు.
కొందరికి రెండు కాళ్ళు
రిక్షావాడికి మూడు కాళ్ళు
ఉన్న వాడికి నాలుక్కాళ్ళు
అందరూ కాంప్టీషన్‌లో పాల్గొన్నట్లే...
అన్నీ ప్లాస్టిక్ సర్జరీ చేసుకున్న ముఖాలే...
ఎవడిది వట్టిడాబో
ఎవడు దొరబాబో అంతు చిక్కదు.

ఇక్కడ
కొన్ని నెమళ్ళుంటాయి.
వాటితో చెలిమి చేస్తే
కంటిలో కాదు సూటిగా
గుండెలోనే పొడుస్తాయి.
మరెన్నో
తోడేళ్ళుంటాయి.
ఇవి మనిషినేం చేయవు
కేవలం శ్రమను మాత్రమే
తోడేస్తాయి.
నగరం...
అర్థంకాని రసాయనశాల.
అందమైన శ్మశాన వాటిక.
నగరం...
చిక్కువిడని పద్మవ్యూహం,
చెక్కుచెదరని మయసభ.
నగరం...
మేడిపండు - వేడి పుండు.
కొందరికిది
అక్షయపాత్ర - మరెందరికో
గుండెలపైనించి పయనించె
కాలం రాక్షస యాత్ర.
నగరం...
రహస్యం బద్దలు కాని
గర్భ నిరోధం.

## మంటల జెండాలు

*2*

కుంచె నుంచి ప్రవహించే చైతన్యం
ఘనీభవించి
కెమెరా ముందు సృజనాత్మకత
ఒక అపరిపక్వ స్వప్నం గానే చితికిపోయి
నానాటికి దారిద్ర్యమనే ఊబిలోకి దిగబడి
బహుశా ఏ పౌరుడూ పాత్రికేయుడూ
పడనన్ని కష్టాలతో
చితికి.... చితికి.... చివరికి
పత్రిక పారితోషికమే జీవనాధారంగా
స్వీకరిస్తున్న నేపథ్యంలో
హృదయం విప్పి నన్నీ నాలుగు మాటలు
చెప్పుకోనివ్వండి

## కవితల క్రమం

## గుండె సైన్యం

చీకట్లో జడుసుకుంటే
ఒక చెట్టే నీ చుట్టూరా
అరణ్యమై భయపెడుతుంది
గుండెంటూ కలిగుంటే
నీ వెంట అదే
పెద్ద సైన్యమై నిలుస్తుంది

## బిందువూ అనంతం

ఒక చెమట బిందువును
విపులీకరిస్తే
ప్రతి ఫలిస్తాయెన్నో
కళా ఖండాలు
ఒక కన్నీటి బొట్టుని
పరిశోధిస్తే
పరిధే దొరకదు
మరి బాధలకు

## జ్వరం

ఖచ్చితంగా
మన సమాజానికెప్పుడూ
నూటా మూడు డిగ్రీల జ్వరం
ఏ రోడ్డూ ఏ ఇల్లూ ఏ మనిషి ముఖం చూసినా
భయాన్ని కక్కుకుని
పిరికి తనపు విరేచనాల్లో పొర్లాడే
అసహ్యకర వాతావరణం
థూ!
దీనికి చావన్నా మూడదు
అమాంతం ప్రళయమన్నా మింగేయదు

## రాజకీయం

ఒక నక్క
ప్రమాణస్వీకారం చేసిందట
ఇంకెవర్నీ మోసగించనని
ఒక పులి
పశ్చాత్తాపం ప్రకటించిందట
తోటి జంతువుల్ని సంహరించినందుకు
ఈ కట్టుకథ విని
గొర్రెలింకా
పుర్రెలూపుతూనే ఉన్నాయ్

## చెదలు

కష్టపడి చదువుకున్నందుకు
పర్యవసానం
నిరుద్యోగం, కేరాఫ్, రోడ్లు, ఇంటర్వ్యూలు
విశేషాలు ఇంతే సంగతులు
ఈ రోజుల్లో
రూపాయి బిళ్ళల్లాంటి కళ్లు కలిగుంటేనే
ఉద్యోగం
మన కంటపడే పరమాణువు
కేవలం
డిగ్రీ కాగితాల మీదే ఆధారపడితే
ఇక భవిష్యత్తంతా చెదలే చెదలు

## సమాజం మ్యూజియం

తరాల క్రితం
వందల వేల ఖూనీలు సైతం
చేసొచ్చిన కత్తి
ఇప్పటికీ మ్యూజియం షోకేసుల్లో
చెక్కు చెదరకుండా స్థిరపడి
మెరుస్తూంది
ఎందర్నో మురిపిస్తోంది
రాజకీయ నాయకుడి వాగ్దానంలా
అక్రమవ్యాపారస్తుడి అబద్ధంలా
అమాయకుడిపై అధికారంలా

## చరిత్ర చెప్పని గణితం

సామాన్యుడి జీవిత వృత్తాంతం
ఎప్పుడూ కష్టాలు ఇమిడిఉండే
ఒక బిందువు
అతన్నాధారం చేసుకుని గీసుకునే
వృత్త వైశాల్యాలే
సంపదలు సౌఖ్యాలు సౌధాలు
ఇది చరిత్ర చెప్పిన గణితం కాదు
ప్రతి పెట్టుబడిదారీ వ్యవస్థ
బాహాటంగా ఏర్పరుచుకున్న
స్వార్థపు వలయం

## చెమట వ్యాపారం

నీ శ్రమఫలం
నీ సమక్షంలోనే పాతిపెట్టబడ్డ
విత్తనం
దాన్నే డబ్బుచెట్టుగా పెంచి
దక్కించుకున్న వాడిదే
పెత్తనం

## హృదయం

రాత్రి మాత్రమే
కాసేపు ఈ రోడ్డు
నిశ్శబ్దంగా....
నిర్మానుష్యంగా...
తెల్లారితే మళ్ళీ
ఒకటే రద్దీ....

## నా దృష్టిలో

అంతస్తూ ఐశ్వర్యం
శ్రామికుడి భిక్షం
నా దృష్టిలో ధన మదాంధుడే
అడుక్కు తినేవాడు

## నాతో రండి

శూన్యంలో నిశ్శబ్దంలా
నిశ్శబ్దంలో సమాధుల్లా
బతక్కండి

జ్ఞాపకాల రసి పుండ్లని
గోకటమే వ్యాపకంగా
చావకండి
నాతో రండి
సహనం సాహసం నిప్పుల మీద
కాలాన్ని ఫలంగా వండుకుందాం

## పగ

సాక్ష్యాల్ని పాతేసుకున్న కళ్ళు
కుళ్ళిపోనీ మురిగిపోనీ
నాకవసరం లేదు
నిజం చెప్పటాన్కి తడిలేని నాలుకలు
మూసిన నోళ్ళ చీకటి గుహల్లోనే పడుండి
గొంతెండి చావనీ
చేతులుండీ
అటూ ఇటూ పీనుగుల్లా వేలాడితే
వాట్ని సొంతం నరికేయటమే ధర్మం

## ఇంపాసిబుల్

సూది
మొన
మీద
ఆవగింజని మోపటం
వృధా శ్రమ
నియంతృత్వపు
తుపాకీ
గొట్టం
పైన
భూగోళాన్ని ఆపటం
భ్రమ

## జీవితం

ఈ వృక్షం
నువ్వు ఉరి పోసుకోడానికి
వినియోగింపబడ్డది కాదు
స్వయం కృషిని
శాఖోప శాఖలుగా
విస్తరింప జేసుకొమ్మని

## కృతజ్ఞతా భావం

నువ్వూ నేనూ చూడకపోయినా
ఇంకెవడూ అభినందించకున్నా
కనీసం
మిట్ట మధ్యాహ్నంకోసారి
అర్ధరాత్రి కొకమారూ
కృతజ్ఞతా భావంతో
చేతులు జోడిస్తుంది గడియారం
బొగ్గు గనుల్లో శ్రమించే కార్మికుడికీ
సరిహద్దుల్లో కాపలాకాసే సైనికుడికీ

## ఊరవతల పాతెయ్యండి

ఇంత అన్నం ముద్దకోసం
కడుపే
డొక్కుపోయిన చిప్పలాగై
అరుస్తోంటే
ఆ బతికున్న అస్థిపంజరాన్ని
పోస్ట్‌మార్టమ్ చేసినా
పేగుల్లో ఒక్క మెతుకూ
దొరికేట్టు లేదు
ఏం మొహం పెట్టుకొని
ఈ దేశంలో పుట్టావురా దౌర్భాగ్యుడా! అని
ఖచ్చితంగా
అడగనన్నా అడగండి
లేకపోతే
"గరీబీ హఠావో" అని
వాని మొహం మీదే రాసి
ఊరేగింపు తీసి
ఊరవతల పాతెయ్యండి

## కొరడా

వెలిగించుకోవాలనుకుంటే
నీ గుండెనే ఒక కాగడా
వెదుక్కో నక్కరలేదు
నీ చేతులే ఒక కొరడా

## చంద్రున్ని కాల్చేస్తా.......

ఆ వెన్నెల రొచ్చు గుంటలో
చచ్చిన కప్ప వెల్లికిలా పడ్డట్టు
ఏమిటా చంద్రుడు గాడు
ఛీ!
అదే నా సూర్యుడొస్తే
ఎంత చైతన్యం
ఎంత క్రాంతి మయం
నిద్ర జ్వరం మీద
కిరణాల పవర్‌ఫుల్  ఇంజక్షన్‌లా
పనిచేసి
ప్రతి ఉదయం నన్ను నేను
సరిక్రొత్త పనిలోకి పురమాయించుకోగలిగే
ఏమిటా అతీత శక్తి

## కళ్లు

కళ్ళు ద్వారాలైనప్పుడు
హృదయపు గదంతా
వెలుతురు మయంకావాలి
అలాంటప్పుడే
జీవితాల్ని క్షుణ్ణంగా
పరిశోధించ గలుగుతాం

లేదా
కనుగుడ్ల తెప్పలమీద తేలిపోయే దృశ్యాలూ
తెల్లగుడ్డ కప్పబడున్న శవాలూ
రెండూ ఒక్కటే మరి

## వెల(యాలు)

నగరంలో రోడ్డుకిరువైపులా
వేశ్యల్లా ముస్తాబై నిలుచున్న దుకాణాలు
మధ్యన.... దారిలో... కోర్కెలెన్నో...
సంచరిస్తుంటాయి
సంకోచిస్తుంటాయి
సంబర పడుతుంటాయి
ఆ వేశ్యలు కన్నుకొట్టి రమ్మన్నా
గుండె బిగపట్టుక సాగిపోయే వాడు
సాధారణంగా సామాన్యుడు

## అవగాహన

చింపిరి గుడ్డలోకి కళ్ళు జొప్పించి
తదేకంగా చూస్తేనే,
కడుపులోకి వేళ్ళుగుచ్చి
కకావికలం గావిస్తేనే,

స్పష్టమౌతుందా దరిద్రం..?
అర్థమౌతుందా ఆకలి జ్వరం..?

## ఏమిటీ విడ్డూరం..?

ఏమిటీ విడ్డూరం..?
ఒకొక్కప్పుడు
చెట్లన్నీ
శిలల్లా స్ఫురిస్తాయి
మొహాలన్నీ
నరికేయబడ్డ మొండాల్లా తోస్తాయి
కొమ్మ ఉండీ ఊగని
కొలిముండీ మండని
ఎందుకీ జీవితాలని...

## దరిద్రం

అకస్మాత్తుగా
ఈ అగాధాన్ని పూడ్చటం
ఎవరి తరమూ కాదు
ముందు
తొంగిచూసే గుండె నిబ్బరమన్నా
కలిగుండాలి

ఆ తర్వాత
సానుభూతి పరులైతే
మనిషికో దోసెడు మట్టేసి పొండి

## కాలం గొలుసు

గతం
కనిపించని పరమాణువు
జ్ఞాపకాల మైక్రోస్కోపుతో చూస్తే
ఎంతో పెద్దది

వర్తమానం
సమస్యల కొలబద్ద

భవిష్యత్తు
కాలగర్భంలో పెరిగే
ఆశా శిశువు

## కనిపించని కళాఖండం

శ్రమను అంతస్థుల్లా పేర్చుకున్నా
హస్తగతం చేసుకునే హక్కులేదు

కడుపుని బావిలా తవ్వుకున్నా
నీళ్లు తడుపుకున్న రోజులున్నాయి

విషాదం రోడ్డులా ఘనీభవించినా
బాటసార్లకి సౌకర్యం చేకూర్చాలి

వీడెవడో ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు
అడుగడుగునా అణువణువునా కనిపిస్తాడు

ఈ వర్తక ప్రపంచంలో వీడి శరీరం
ప్రతిరోజూ ఒకడి లాభసాటి పెట్టుబడి

కళలతో వీడికెటువంటి సంబంధం లేకున్నా
సమస్తకళాఖండాలూ వీడితోనే మలచబడతాయి

## మొక్కలు

బాల్యంలోంచే
కన్నీళ్ళు మొలిస్తే మొలవనీ
మొదలవనీ

అవి
కష్టాల వాతావరణంలోనే ఆరితేరి
ఎదగటం నేర్చుకోనీ

కానీ

చెట్లయ్యాక

రహదారి పొడుగునా

ద్వారపాలకుల్లా బతికితే

నేనైతే సహించను

# ఆమె యౌవనం రాయని వీలునామా

ఆమె
బరితెగించి కాదు
బతుక్కే ఉరి బిగించుకుని
ఎన్నెన్నో అలల్ని
ఈ జీవితంలో కలుపుకున్నా
ఒక్కసారన్నా ఉప్పొంగని సముద్రం
ఒక్కోసారి
గొంతు మూగబోయిందన్నా
పాడక తప్పదు
రోజుకో పదిమంది
కీచకులకి స్వాగతం పలికే
ఆమె యౌవనం రాయని వీలునామా

# చరిత్ర

చరిత్ర
వడ్డీ వ్యాపారస్తుడి
ఇనప్పెట్టెలోంచి పుట్టిందా...?
లేక
వర్ధమాన సినీతార
చనుమొనల్లోంచి మొలిచిందా...?

లేక

రాజకీయ నాయకుడి

టోపీకింద పొదగబడిందా...?

కాదు

చరిత్రకు రక్తపాతమే ఉపోద్ఘాతం

చరిత్రకు చెమటబొట్టే ఆధారం

చరిత్రకు ఆకలే ప్రేరేపణ

## నగరంలో రోడ్డు

నగరంలో రోడ్డు

పెట్టుబడిదార్లకి

చెరిసగం ఆస్తుల్ని పంచేసి

రాజీ కుదిర్చిన మధ్యవర్తిలా...

నగరంలో రోడ్డు

నల్ల ధనంలా

కష్టజీవి ఎముకల్లోని ఇంధనంలా...

నగరంలో రోడ్డు

అడపా దడపా

బాధల బాటసార్లని

మింగేసే కొండచిలువలా...

నగరంలో రోడ్డు

పద్దెనిమిది వందలా ముప్పై రోజులకోమారు

ప్రజల్లోకొచ్చిన

ప్రఖ్యాత నాయకుడి

ఎడతెగని ఉపన్యాసంలా......

## పెత్తందార్లు

నీ ఇంటి చుట్టూ తుపాకుల కాపలా వున్నా

ఈ రాత్రికి కవచం లేదు

నీ ఆలోచనల చిత్రవధకి అంతం లేదు

అవును

నీ పొట్టనిండా దౌర్జన్యపు కూడు

నీ బతుకంతా అక్రమాల ఊబి

అందుకే

ఇంత దట్టమైన చీకట్లోనూ

జగిత్యాల సిరిసిల్లా

సరికొత్త ఆయుధాల్లా

క్షణం క్షణం నీ గుండెల్లో తళుక్కుమంటూ...

## అంతు చూద్దాం...

పత్రికల్లో రోజుకోతీరు అక్షరాల ఆసనాలేసుకునే
రాజకీయప్పురుగుల్నీ

సినీస్టార్ల చర్మాన్నీ వాల్‌పోస్టర్లా అంటించి
ఎరచూసే చిత్రసీమ నక్కల్నీ

ప్రభుత్వ కార్యాలయాల ఫైళ్ళ కింద పాకే
లంచగొండి తేలుకొండీల్నీ

కాటేసే నాగుపాములా పడగెత్తిన బంగళాల
ఘరానా వర్తకుల విషపుకోరల్నీ

అధికార జలాశయాల్లోనే విర్రవీగే
నియంతృత్వపు మొసళ్ళనీ...
ఇంకా చాలావాటిని
నామ రూపాల్లేకుండా ధ్వంసం చేయాలంటే

ముందు
ధైర్యం వీర్యం కోల్పోయిన ఈ జాతి నపుంసకుల్ని
మనకి దూరంగా ఉంచడం మంచిది

# దహన సంస్కారం

ఇక్కడ ప్రతిరోజూ రాత్రి
ఇళ్ళన్నీ దగ్గర దగ్గరగా పేర్చబడ్డ శవపేటికలు
నగరం నగరమంతా భయంకర స్మశానం

వరుసగా వీధి దీపాల శోకాలు తప్ప
మరేం ఉండవ్

ఇది ఉపమానం కాదు
ఉన్నమాటే

అందుకే అంటున్నా
అడవుల కడుపుల్లో రగిలే ఓ  కార్చిచ్చూ!
ఒక్కసారి
ఈ నగరం పొలిమేరల్లోకి రా!
దయచేసి దహన సంస్కారం చేసిపో!

## చురకలు || 3

నేనేనాడు పొగడ్తలని పోషక పదార్థాలుగా
స్వీకరించి
ఉబ్బితబ్బిబ్బవ్వలేదు.
సగం సగం కమ్యూనిస్టుల సహవాస దోషం
లేకున్నా
సహపంక్తి భోజనాల్లో కూర్చున్నట్లే కూర్చొని
ఒకర్నొకరు అనుమానాస్పదంగా చూసుకొనే
సాహిత్య సభల్లోకి తరచూ
వెళ్లకున్నా
అడపా దడపా జననాట్యమండలి గుండె
చప్పుడు వినో
అరుదుగా కదిలే జన మైదానాలను కనో
ప్రతిస్పందించే నాకు మెజారిటీ ప్రజల
బాధలూ గాథలే ముడి సరుకయ్యాయి.

## కవితల క్రమం

## టోపీ

ఎన్నికల్లో
ఓట్లడుక్కునే చిప్ప

## ఫినిష్

ఆస్తంతా అమ్మేస్తే ప్రొడ్యూసరు
కాస్తంతా మైండుంటే డైరక్టరు

## నిదర్శనం

సిగరెట్టు పీకలే ఆలోచనలకు నిదర్శనమైతే
బ్రాందీ గాంధీ కన్న గొప్పే

## కవలలు

సెక్స్ – క్రైమ్ కవలలు
కలిపి చదివితే నవలలు

## పండని పంట

చదువు పొలంలో ఎంత దున్నితే
నిరుద్యోగం పంట అంత అధికమౌతుంది.

## ఫోను

అది ఉన్న వారి కుక్క
ఉన్న చోటే మొరుగుతుంది.

## వకీలు

న్యాయాన్ని ఏ కీలు కా కీలు
విరగ్గొట్ట గలవాడే వకీలు

## శంఖుస్థాపన రాయి

ప్రగతి వెంట్రుకలు మొలవని
బట్టతల

## "దేవుడు"

మున్సిపాల్టీవాడు మన పాల్టి దేవుడు
కంపు బాగా నిండాకే మోర్లో పారెట్టి 'దేవుడు'

## పిసినారి

ఒక్క గడ్డిపరకన్నా చెయ్యదు దానం
అదే....డబ్బున్న మైదానం

## సర్‌ప్రైజు

అసమర్థుడు పొందితే ప్రైజు
ప్రతిభాపరుడు పొందేది సర్ - ప్రైజు

## గుడి

శనివారం
అదొక షోరూం

## సుత్తి

మేకుకేసి
గోడని బాదటం

## మైకు

ఎవ్వడూ తవ్వలేని
వాగ్దానాల నిధి

## హాని

వెకిలినవ్వు - నకిలీ మందు
వొంటికి మంచివి కానే కావు

## ముచ్చటగా

ముచ్చటగా దేశాన్ని కొల్లగొట్టేది ముగ్గురే
మినిస్టర్సు సినీస్టార్సు క్రికెట్ ప్లేర్సు

## అసహ్యం

రోగిష్ఠి ఉమ్మి చుట్టూ ఈగలు
పాపిష్ఠి డబ్బు చుట్టూ మనుష్యులు

## ఈ రోజుల్లో

ఒక్క దెబ్బకి రెండు పిట్టలు
కలవాడికి కవలలు

## రేప్‌సీను

ఆసీనులై ఉన్న వారిలో అమితంగా
ఆ 'సీను' కోసమే ఆవురావురంటారని

## లావా

సామాన్యుడికీ గొప్పోడికీ నడుమ
లావాదేవీ కుదరనప్పుడే 'లావా'

## అసమర్థత

పబ్లిగ్గా అన్యాయమని అరవలేని వాడు
ఓపిగ్గా ఒక్కొక్కర్తో గుసగుసలాడ్తాడు

## ప్రయోజనం

ఉంటారు కొంత జనం
జనాభాలెక్కల్లోకి తీసుకోడానికే ప్రయోజనం

## భారీ కలెక్షన్లు

అందమంతా 'తెర' బెడితే ఏం చేస్తారు
'ఏ' క్లాసో ఏ 'క్లాసో' ఎగబడతారు

## మధ్యవర్తి

సిగరెట్లకీ క్యాన్సర్లకీ మధ్యవర్తి
పొగ

## పట్టా

భూమిని
చాపలా చుట్టెయ్యటానికి

## పీనుగలు

*రోడ్డనే పటమ్మీద ఊగాడే బొమ్మలు*
*తలకిందులు చేసేస్తే వేలాడే పీనుగలు*

## కవి – సమ్మెట

*చదివిన కవిత 'చలి – ముదుసలి'*
*కప్పించుకుంది కశ్మీరు శాలువా*

## సర్వరు సుందరం

*ఎజమాని ఏడుప్మొహం కంటే వీడే నయం*
*ఎప్పుడు చూసినా ఉట్టిపడుతుంది వినయం*

## మూడు ముక్కల్లో

*రోగులంతా శవాలై, ఆసుపత్రులన్నీ శ్మశానాలైతే*
*కాటి సుంకంకై కాచుక్కూచున్నోళ్లే – డాక్టర్లు*

## వరం

*కోర్టులో గుమాస్తాగిరి దొరకినా వరం*
*కోర్టు చుట్టూ తిరిగే వాడికైతే క్షవరం*

## థియేటర్

చచ్చు సినిమాలకై నిర్మించిన
భారీ గోరీ

## కాంట్రాక్టరు

తను కట్టిన ఏ కట్టడం ఎప్పుడు
కూల్తుందో చెప్పగలిగే జ్యోతిష్యుడు

## లేబుల్

అన్యాయం అక్రమాల లేబుల్
కానిస్టేబుల్

## ఓ నవల వృత్తాంతం

భగ్న ప్రేమికుడి హృదయం కోడిగుడ్డులా పగిలి
విషాదం సొనలా కారిపోయిన వైనం

## ఖర్మ

రేడియోతో కొడితే
జనరంజని మొదలైనట్టు

## వెన్నెల

సుష్టుగా తిని బలిసున్న చంద్రుడికి
ప్రపంచమంతా వెన్నెలే వెన్నెల

## చస్తావ్

నీలోని పిరికితనం వ్యాకోచం చెంది చెంది
హఠాత్తుగా ఓసారి గుండె పగిలిచస్తావ్

## పుష్ఠీ

మానభంగాలూ మర్డర్ కేసులే
వార్తా పత్రికలకి పుష్ఠికరమైన ఆహారం

## స్లో...గన్

కొందర్నేకాల్చగలదు గన్
ఎందర్నో మండిస్తుంది స్లోగన్

## పబ్లిషర్

పుస్తకం ఆవులిస్తే
పేజీలు లెక్కెట్టేవాడు

## మెడలు

మెడలు వంచి శ్రమించే వాడిని
వరించనిదే గోల్డు మెడలు

## బ్యూటీ పార్లర్లు

ముసలితోలు సాగదీసి
ముడతలిస్త్రీ చేసే మేస్త్రీలు

## ప్రకటన

మీ వెంట్రుకలు కొరివిదయ్యాల్లా మెరవాలంటే
మా కంపెనీ వినూత్న సృష్టి డాంబర్నే వాడండి

## ధరలు

ఒకనాడు జరిగిన చిన్న పరాభవానికి
రోజు రోజుకీ విస్తృతమౌతున్న శతృత్వంలా

## పెళ్ళిచూపులు

చుట్టూరా క్రూరమృగాలు
నడుమ బిక్కచచ్చిన లేడిపిల్ల

## కావలి

*చిన్నింటికి తాళమే కావలి*
*గొప్పింటికి గూర్ఖాయే కావాలి*

## నాయకుడూ పార్టీ

*వాడు ముందే వానపాము*
*మరి ముడ్డెటో మూతెటో*

## పరిష్కారం

*బిందెలూ బిందెలూ కొట్టుకుంటే*
*నడుమ నాకేమిటని నల్లా బందైందట*

## చిక్కని పాలు

*హైదరాబాదంతా పిండితే*
*చిక్కనిపాలు బంజారాహిల్స్*

## చీమ

*చెమటకి చక్కని నిర్వచనం*
*చెక్కు చెదరని నిదర్శనం నిరంతరం – చీమే*

## సమస్య

పరీక్షలంటే జలదరింపులు
పుస్తకాలంటే ఆవలింపులు

## భక్తి – పర్యవసానం

తిరుపతి కెళ్లొచ్చిన గుండు
తీరిగ్గా గాట్లు లెక్కబెట్టుకోటం

## చందమామ

పేదరికాన్ని పరిహసించే
ఆకాశపు చపాతి

## ముఖచిత్రం – మూర్చోత్తరం

ఆహా! అట్టమీద బొమ్మ ఏమద్భుతం
అబ్బా! ఒకటుంటే బాగుండు భూతద్దం

## సినిమాలు – ప్రేక్షకులు

కోచింగు లేని మ్యాచికి
చప్పట్లు కొట్టే సన్నాసులు

## పురోహితుడు

వ్రతమైతేనేం, ఎవరి శ్రాద్ధమైతేనేం
వాడి బొర్రెప్పుడూ ఫిక్స్‌డ్ డిపాజిట్టే

## ఆధారం

నువ్వొంచిన నడుమ్మీదే ఆధారం
పెట్టుబడిదారీ వ్యవస్థ ఆదాయం

## బర్త్‌డే పార్టీలు

కొవ్వెక్కి ఉండటం
కొవ్వొత్తులూదటం

## యోగం

ఎమ్మే పీ హెచ్‌డీలు అయితే ఏం లాభం
ఏ ఎమ్మెల్లేకి బామ్మర్దివైనా ఉపయోగం

## జీరో

అంకెల అండ చూసి
పోజు కొట్టే హీరో

## పిల్లలు

నేటి సీమటపాకాయలే
రేపటి ఆటంబాంబులు

## మ్యాట్నీ

అదో
పగటి కల

వీరుడు

అప్పు చేస్తే మగాడు
ఎగ్గొడితే వీరుడు

## ‘0’

సున్నాని ఎటు దొర్లించినా
లావూరిన హీరోయినే

## బాట

గొర్రెల మందతో నడిచేకంటే
చీమల బారులో చేరితె మేలు

# ప్రయోగం

దున్నపోతు చర్మం
నాలుగ్గాడిద కాళ్ళు
ఒక పంది ముఖమూ
కలిపి కుడితే
జంతువు కాని జంతువు
నేటి తెలుగు సినిమా హీరో

వివరణ:
ముప్పై మంది
ముష్టి ఘాతానికైనా
తట్టుకోగలది
దున్నపోతు చర్మం మాత్రమే

బురదలోనూ
బూడిదలోనూ
గెంతడానికి పొర్లడానికి
శ్రేష్ఠమైనవి గాడిద కాళ్ళే

ప్రేక్షకుడు
ఏ హావభావమూ
స్వీకరించలేదు గనుక
పంది ముఖమే
హీరోకి పరమానందం

## రక్తరేఖ
## 4

రోజుకో 'మందు' బృందంలో పాల్గొని
పలుచబడిపోతున్న సాహిత్య భ్రష్టుల
కోసమో
అవార్డుల కోసం క్యూలో నిలబడే అర్భకుల
కోసమో
ఇస్త్రీ నలక్కుండా విప్లవ సందేశాల్ని
అందించే మేధావుల కోసమో
కవిత్వంలోనూ, జీవితంలోనూ ద్వంద్వ
ప్రమాణాల నవలంబించే
దౌర్భాగ్యుల కోసమో కాక, సామాన్య
పాఠకుడి కోసమే
ఈ 'సిటీలైఫ్'ను ప్రచురించడానికి
పూనుకున్నామని చెప్పొచ్చు.

## కవితల క్రమం

## ఈ తరం క్రీస్తు

బలవంతంగా
విద్యార్థుల్ని
పుస్తకాలకి
శిలువేసి
సంవత్సరాల
మేకులు
దిగేసి
వొదిలేస్తే
ఈ విద్యా వ్యాపార వ్యవస్థలో
నెత్తురోడుతూ
యింకెందరు నిరుద్యోగ క్రీస్తులో

## పోరాటం

పురుషాహంకార సముద్రం మధ్యన
చిక్కి
తల్లడిల్లితే ఒక రమణీయ ద్వీపం
వరకట్న దురాచారపు అంధకారంతో
పోరేందుకు
సమాయత్తమైందొక చిరుదీపం.

## వర్గతత్వం

మెతుకులేరుకోవటం మీ విధి
మీ కడుపులు నిండకుండా చూసే బాధ్యత మాది
మెడలు వంచి శ్రమించటం మీ ఖర్మం
మీ వెనుక మేడల్లా నిలబడి పర్యవేక్షించటం మా కర్తవ్యం
మీరు పునాదుల్ని తవ్వుతూనే ఉండండి
మిమ్మల్ని పూడ్చిపెట్టే పూచీ మాది

## అగ్ని సముద్రం

*నిశ్శబ్దపు తంత్రుల మీంచి*
*దొర్లిపడిన*
*ఆర్తనాదంలా....*
*గాయాల పేజీలు*
*పురి విప్పిన*
*నెమలి పింఛంలా....*
*కన్నీళ్ళ నిచ్చెనతో*
*కర్కశ పాదాల్ని మోస్తున్న*
*కఠోర తపస్సులా....*
*శకలాలుగా మిగిలిన రాత్రుళ్ళపై*
*శవాసనం వేసే*
*విషాద భరిత చిత్రంలా....*
*ఆమె....*
*అగ్ని సముద్రమీదే అందాల పడవ*

## ఆకలి

ఆకలి మండి పోతున్నప్పుడు
ఎదుట ఎంతటి మనోహర దృశ్యమున్నా
దగ్ధమై పోవాల్సిందే
ఆకల్ని నిగ్రహిస్తున్న కొద్దీ
కడుపులో పేగుల్ని
కత్తిరిస్తున్న బాధే
ఆకలి
పూటకో దరిద్రున్ని వేపుకుతిని
అది ఉమ్మేసే తొక్కలే
అసంఖ్యాకపు అస్థిపంజరాలు

## ఆక్టోపస్

నువ్వు వంగి వంగి
దణ్ణం పెడుతున్నంత సేపూ
ఆ దణ్ణమే వానికి పునాది
ఛాతీ విరుచుకు నిలబడ్డానికి
నువ్వు చెమటోడ్చినంత కాలం
వాడు నీ పచ్చదనాన్ని పీల్చేస్తూనే ఉంటాడు
ఇదిగో దొరా!
"నా రక్తమాంసాల్నే నీకు పెట్టుబడిగా
సమర్పిస్తున్నా" నంటే
"అదిగోరా నీ లాభం
ఆ ఎముకల్లో మిగిల్చాననే" పెత్తందారీ సర్పం వాడు!

## ఉనికి

అలా
సమాధిలా
అంగుళం మేరకన్నా
కదలకుండా పడుంటే ఎలా?
కొన్నాళ్ళు పోతే
నీ మీద నానా గడ్డీ మొలిచి
నీ ఉనికే నీకు తెల్సిచావదు

## దొర

నువ్వు
ఉరిమి చూసినప్పుడేమో
ఊరంతా పాలేర్లే
వాళ్ళే
ఊరినించి తరిమికొడితే
నీ బ్రతుకంతా పల్లేర్లే

## దేశం

తల
అవతల పెడదామంటే
ఒకటే యుద్ధాల గోల

పోనీ
లోపలికని ముడుచుకుందామంటే
రోత రాజకీయాల రొద
కాసేపు
నిలబడన్నా ఉందామంటే
ఠక్కున నెత్తికి తాకి బొప్పి కట్టించే
నిత్యావసర వస్తువు ధర

## భరతావని

ఎన్ని భవనాల ఆభరణాలు తొడిగినా
హరిత విప్లవాలే కప్పినా
అస్థిపంజరమే భరతావని
ఆర్తనాదమే వర్తమానము.

## అశ్రుకావ్యం

ఆమె
కళ్ళ
ముళ్ళకంచెని
అల్లుకునే ఆకలి తీగ

పెదవుల
పాషాణంపై
విరిసే
సిఫిలిస్ పువ్వు
పత్రహరితమే
హరించిన
బతుకు చెట్టు

ఆమె కాలాన్ని ఆశ్రయించిన అశ్రువు
కాలుష్యంలో
అంతర్లీనమైన ప్రాణవాయువు
సహజసిద్ధంగా
ఆమె...
నెత్తుటి గాయాల సంపుటి
రగిలే బాధల కుంపటి

## కపాలం

కపాలానికి కళ్లుండవ్
వికృతంగా చూస్తుంటుంది
కపాలానికి నోరుండదు
భయానకంగా వికటాట్టహాసం చేస్తుంది

కపాలం
చీకటి మెడలో హారంలా మెరుస్తూ
మిడిసి పడుతుంది

రక్తం కోల్పోయి, తెల్లగా పాలిపోయినా
అహంకారమే దానికి అలంకారం

నిజానికి
రాజకీయాల చితిలో కాలిపోగా మిగిలిన
అవశేషాలే
ఈ ప్రభుత్వం కపాలం
అభివృద్ధి పథకాల అస్థికలూ

## అరాచకత్వం

శవాలపై ఆసనాలు వెయ్యడం
శవాలపై శాసనాలు చెక్కడం
శవాలపై స్వారీ చెయ్యడం
శవాల్ని స్వాహా చెయ్యడం
రాజకీయాలుగా పరిగణించబడితే
ఈ దేశంలో
పోగేసిన శవాల గుట్టవంటి
బ్యాలెట్ పెట్టెపై
ఆధిపత్యమే ఒక అరాచకత్వం

## దోపిడీ చిహ్నం

చరిత్ర కురూపి
చెక్కిలి పైన
తాజ్ మహల్ మెరుస్తోంది

తరతరాలకు
తడియారని
కన్నీటి బొట్టులా

## వధ్యశిల

నీ ఫైఫ్ స్టార్ కళ్ళ
మైకపు పొరల్లోంచి తప్ప...
ఈ ఇరవయ్యో శతాబ్దపు వధ్యశిల మీద
ఇంకా చెరిగిపోని
స్త్రీ హృదయ విదారక దృశ్యమే
క్యాబరే....

## దశ

ఇది వరకు
సమాజ శరీరమ్మీద చీరుకుపోయే
చిన్న రౌడీ 'బ్లేడు'

ఇవాళ
ఇంటింటికీ చేతులు జోడించి
ఎన్నికల్లో మెరిసిన  ఎమ్మెల్లే 'చాకు'

రేపు
అరాచకీయాల్లో ఆరితేరి
కాగల మంత్రి 'గండ్రగొడ్డలి'

## శవచైతన్యం

వెండి తెరపై
నువ్
వ్యభిచరిస్తున్నప్పుడో

క్రికెట్ క్రిమి
నీ మెదడుని
తొలిచేస్తున్నప్పుడో

బురద రాజకీయాలు
నీ ముఖం నిండా
పులుము కున్నప్పుడో.... తప్ప
లేనే లేదిక నువ్ బతికున్న దాఖలా

## కళాపోషణ

తొంభైతొమ్మిది మంది
చర్మాన్ని వొలిచి
నూరోవాడొక్కడే
పరుచుకునే తివాసీ
ఈ దేశంలో
'కళాపోషణ'

## చిలుం

ప్రతి రోజూ
ప్రభుత్వ కార్యాలయం కుర్చీలో
లంచం
నెమలి పింఛంలా పురి విప్పుకుంటే

యధేచ్ఛగా
కాంట్రాక్టర్లు
యిసుక సముద్రంలో మునిగి
జలకాలాడితే

ఈ దేశపు దళారీ సంస్కృతి
పగలబడి నవ్వినప్పుడల్లా
కట్టడాలన్నీ
కృత్రిమ దంతాల సౌందర్యంతోనే
తళుక్కుమంటాయి

## నాగరికతా సౌధం నువ్వే....

ధరాతలమంతా నువ్వే...
ధారాపాతంగా
కురిసే చీకట్లో
వొణికే ఒక దీపపు సెమ్మా నువ్వే.....
ప్రపంచం అంచులవరకూ
ప్రవహించే చైతన్యం నువ్వే
ప్రకటనల గాలి
వీచినప్పుడల్లా
రాలిపడే
ఒక నాజూకు పూలరెమ్మా నువ్వే...

అగ్నీ నువ్వే
నగ్నత్వం పునాదులపై
నాగరికతా సౌధం నువ్వే....

## దేశాన్ని తవ్వుతుంటే

ఓ ఆడదాని కళ్ళు తవ్వేశా
కన్నీటి శిథిలాలు బయల్పడ్డాయి
ఓ దౌర్భాగ్యుడి పొట్టలో ప్రవేశించా
పేగులు నాగుబాముల్లా బుసలు కొట్టాయి.
ఓ చిన్నారి హృదయాన్ని స్పృశించా
వాని తల్లి శిలావిగ్రహమే బ్రద్దలైంది

## అబద్ధం

అసంఖ్యాకపు
ఆకలి చావుల్ని చెరిపి
ఆర్తనాదాల
గొంతుపిసికి
కుహనా రాజకీయాల సాక్షిగా
మనమంతా
అబద్ధమే చెబుదాం
ఈ తెలుగు నేల ఒక స్వర్గసీమని.....

## అగాధం

న్యాయం గాయమై
సంవత్సరాల తరబడి
సలుపుతున్న బాధే
కోర్టు
నయవంచనకి
నిర్వచనమే
నల్లకోటు
చట్టమేర్పరిచిన
అగాధం
బోను....

## దహన సంస్కారం

ఇక్కడ ప్రతిరోజూ రాత్రి
ఇళ్ళన్నీ దగ్గర దగ్గరగా పేర్చబడ్డ శవపేటికలు
నగరం నగరమంతా భయంకర శ్మశానం
వరుసగా
రోడ్ల మృతకళేబరాలకానుకుని
నిశ్శబ్దంగా విలపించే ఎలక్ట్రిక్ స్తంభాల ఉనికి తప్ప

చిట్లిపోతున్న అస్థిపంజరాల రాశి మీద
నిట్టనిలువుగా పెరిగే అంతస్థుల దెయ్యాలు
కిటికీల కళ్ళు చిట్లించి చీకట్లోకి చూట్టం తప్ప

నాగరికత నరాలు బిగిసి
పరస్త్రీ నగ్నత్వం కోసం అర్రులు చాచే
దోపిడి క్లబ్బుల 'ధనుర్వాతం' ముదరటం తప్ప

నైతిక విలువలంతరించిన ఈ రాత్రి
నగరంలో యింకా ఏం మిగిలిందని....?
అందుకే అర్థిస్తున్నా
అడవుల కడుపుల్లో రగిలే ఓ కార్చిచ్చూ!
ఒక్కసారి ఈ నగరం పొలిమేరల్లోకి రా!
దయచేసి దహన సంస్కారం చేసి పో....?

## ప్రతి అణువూ....

ట్రిగ్గర్ పై
నీ వేలే
బిగుసుకోకున్నా
కత్తి పిడిపై
నీ వేలిముద్రలే

హత్తుకోకున్నా
నెత్తుట్లో
నీ చేతులే
ముంచెత్తకున్నా
నీ పాదాల కింద
పరుచుకున్న
ప్రతి అణువూ
యుద్ధ భూమే

## రిక్షాయానం

ఎముకలా వీడు
ఎవడికిచ్చేశాడో మాంసాన్ని
ఏనుగులా  వాడు
ఎందుకు పుట్టాడో భూమ్మీద
వీడేమో... ఈడుస్తూ... ఏడుస్తూ....
వాడు పొట్ట బరువైనందుకే ఒగరుస్తూ...
ఒక ఎముకే మాంసం ముద్దని లాక్కెళ్తున్నంత వింత

## గాయం

ఎర్రని
గాయాన్ని
గాయంగా మాత్రమే
పరిగణించేందుకు వీల్లేదు

అదొక
ప్రమాద సూచిక
ప్రారంభ సంచిక

## సభ

ఆకలి
అధ్యక్షతన
ఖాళీ కడుపే
ఒక బహిరంగ సభ
నినదించే
పేగులే
జనం

## కృత్రిమ సౌందర్యం

పెట్టుబడి పెదవుల మధ్య
పదునైన షోరూం దంతాలు
మెరవగా
పట్టణాల చెక్కిళ్ళే
నల్ల ధనంతో ఎరుపెక్కితే
అదే–దోపిడీ సంస్కృతి కృత్రిమ సౌందర్యం

## నిర్మాణం

రక్తకణాలు ఉత్పత్తి చేసే
కర్మాగారాలు
నిర్మిద్దాం
రక్తంలో నిక్షిప్తమైన
సూర్యుళ్లని
వెలికితీసి
ప్రచండంగా వెలిగించే
ప్రయోగశాలలు
స్థాపిద్దాం
లేదా

ఇంత నెత్తురూ వెల్తురూ
కోల్పోయిన ఈ దేశం
ఇంకెంతో కాలం బతకదు...

## నువ్వే...

అశ్రుభరిత నయనంలో నువ్వే
క్షతగాత్రుడి నేత్రంలో నువ్వే
అయితేనేం
ఉద్యమాల హారంలో నువ్వే
ఉజ్వల భవితవ్యంలో నీ నవ్వే

## జ్వాల

కాలం
నీకొక చితిలా గోచరిస్తే
నాకొక
మంటలా భాసిస్తుంది
నీకైతే
ప్రతిరోజూ దహన సంస్కారం
నాకది
అనుక్షణం ఒకచైతన్య జ్వాల

## నిజాయితీ

తను లేకుండా
ఏ చిన్న కార్యమైనా దుర్లభమౌతుందనే
అహంకారమూ లేదు

నియంతగా నిలబడి శాసించే
అధికార దుర్వినియోగమూ
కనబడదు

నిరంతరం నలుగుర్తో కల్సి శ్రమించటమే
బొటన వేలి
కర్తవ్యం

## పింజర

వాడు–
కాలాన్ని రేసుగుఱ్ఱంలా పరుగెత్తించలేడు
కిరసనాయిలు డబ్బా పట్టుకుని
క్యూలో మెల్ల మెల్లగా కదుల్తున్నవాడు

వాడు–
బతుకుని చెక్క బుక్కులా తిరగెయ్యలేడు
జేబు గొయ్యిలో పాతేసిన
మురికి రూపాయి శవం కోసం వెదుకుతున్నవాడు

వాడు–
అమూలాగ్రం సమస్యల్ని పరికించే మేధావి కాడు
అనుక్షణం నిరాశాంకుశంతో పొడుచుకునే
నిర్బలుడు

## యుద్ధభూమి

గతం–
త్యాగాల శిఖరాగ్రమ్మీద నిలిచిన
సైనిక శిబిరం

వర్తమానం–
మారణాయుధాలతో అలంకరించిన
మనిషి ముఖం

భవిష్యత్తు–
కాలగర్భంలో ఆవిర్భవించే అణుబాంబు

## పోరాటనేత్రం

అడుగంతా
తడిసిన కన్నీటి సముద్రం
ఉపరితలమంతా
వెలసిన నెత్తుటి ఆకాశం
మధ్యన వెలిగే
మహోజ్వల మానవ నేత్రమే
పోరాట సూత్రం...

## నిజరూపం

ఒక పసిగుడ్డు కాళ్ళూ చేతులూ తెగ్గోసి
వేళ్ళాడదీసిన దృశ్యం కంటే ఘోరంగా

నడవలేని వృద్ధుడి పొట్టలో కత్తి దింపి
పేగుల్ని బహిర్గత పరిచిన దృశ్యంకన్నా దారుణంగా
పురిటి నొప్పులు పడుతున్న ఒక స్త్రీ పై
అత్యాచారం జరిపే కామాంధుడి కన్నా వికారంగా
నాకీ దేశపు వర్తమానం
ఇంకా ఘోరంగా, దారుణంగా, వికారంగా కనిపిస్తుంది

డబ్బు దండెత్తి దౌర్జన్యం దండెత్తి వంచన దండెత్తి
మనుషుల్ని నిలువునా కొల్లగొడుతుంది
అణువణువూ కబళిస్తోంది

ఒకడు దోచుకునే ప్రామిసరీ నోటైతే
ఒక దరిద్రుడు దానిపైన ఆకలి సంతకమౌతాడు
ఒకడు గనుల్లో ఫ్యాక్టరీల్లో పొలాల్లో చెమటై కారిపోతే
మరొకడు ఆ చెమటతో సేఫ్టీ లాకర్ గర్భంలో
పిండమై ఎదుగుతూ ఉంటాడు

నరనరాల్లో నల్లధనం జీర్ణించుకున్న బలశాలి
అమాయకుల వందల వేల గుడిసెల్ని
అమాంతం పీకేస్తాడు
అటు పోలీసులూ యిటు గూండాలూ

కుడి ఎడమ భుజాల్లా కలిగున్న పెద్ద మనిషి
ఎన్ని చీకటి హత్యలైనా చేసి
సంఘంలో హంసలా ఈదగలడు
పావురమై ఎగుర గలడు
అసంఖ్యాక శ్రామిక స్వేదంలో ఘనీభవించిన
కళాఖండమనబడే
తాజ్‌మహల్ ఎందుకోసం?
తరతరాలూ తమ రాచరికపు శవసంస్కృతిని
చాటడం కోసం

మంత్రిగారి భౌతిక కాయమ్మీద
ఊపిరి సలపనన్ని గంధపు చెక్కలు పేర్చితే తప్ప
దహన సంస్కారం జరగని ఈ దేశంలో...
ఒక అనామక శవం
రోడ్డు పాడె మీద బిగుసుకుపోయి–మనల్నర్థిస్తూనే
ఉంటుంది
యింత గొయ్యితీసి మట్టి కప్పమనో
నాల్గు పుల్లలు పోగేసి తగలబెట్టమనో

అధికారం అహంభావం కల్సి మనిషిని పీక్కుతింటున్న
వ్యవస్థలో
మృత్యువుకీ మృత్యువుకీ మధ్య
భరించలేని వ్యత్యాసమేర్పడుతుంది.

## 2

అస్థికలూ బూడిది వంటి
అలనాటి వైభవాల అవశేషాల్ని
మ్యూజియాల్లో మిగిల్చి
ఈ దేశం మీంచి బంగారు పిచ్చుకెప్పుడో
ఎగిరిపోయింది
–కాదు కాదు దేశదేశాల వేటగాళ్ళకి బలైంది

కట్టెలు కొట్టేవాడి బస్తాలు మోసేవాడి వీపులా
ఈ దేశపు వెన్నెముకా వంగిపోయింది

విషపు గాలి సోకి
జెండా గుండెలు విలవిల్లాడి
అది కన్నీరు రాలుస్తూంటే
అవి పుష్పాలూ ఆనంద భాష్పాలుగా భ్రమసి
చప్పట్లు కొట్టి క్షణికానందం పొందే కోట్లాది జనానికి
నా జోహార్లు

అస్థిపంజరం వంటి భరతమాతకి
కృత్రిమంగా నినాదాల మాంసకృత్తులే అతికించి
ఆపాదమస్తకం పొగిడే కుళ్ళు రాజకీయాలకు నా
జోహార్లు

కానీ–నామమాత్రపు స్వతంత్ర భరతమాతని
ఎక్స్‌రే తీసి చూస్తే తెలుస్తుంది ఎన్ని రోగాల
పుట్టో...
ప్రతిసారీ ప్రణాళికల పాకుడురాళ్ళమీద జారిపడి
మన వర్ధమాన దేశం
మోకాళ్ళ మీద దేకటమే అనివార్యమైపోయింది.

3

దేశానికి ఊపిరితిత్తుల్లాంటి పొలాల్ని పండించే రైతు
గుండెల్లో
బంజర్లుంటాయ్ –

ఆ మట్టిని నమ్ముకు బతికే వాడు
వికసిస్తున్న నాగరికతలకి దూరంగా
విరజిమ్మే ఫౌంటేన్ల బృందావనాల సౌందర్యాలకి దూరంగా
ప్రసరించని ప్రాథమిక విద్యా కిరణాలకి దూరంగా
ఎక్కడో, మురికిలో, గుడిసెలో, గుడ్డి దీపం కింద,
చలిలో చాపతో
అతి సాధారణంగా జీవితం గడిపేస్తుంటాడు

వాడు మట్టిలో వేళ్ళు జొనిపి–అన్నం ముద్ద వెలికి తీసే
దేవుడు

అలాంటోడి శ్రమని తోడేసే
తోడేళ్ళు కాచుకునుంటాయక్కడ
వాళ్ళే–పల్లె పల్లెకీ విస్తరించి తెగ బలిసిన
పెత్తందారీ గాళ్ళు

ఫ్యాక్టరీలో కమిలిపోయే కార్మికుడే
విలాస పురుషుడి చేతివేళ్ళ మధ్య వెలిగే సిగరెట్టౌతాడు
ఫ్యాక్టరీలో కంపుకొట్టె కష్టజీవే
పరోక్షంగా సుగంధపరిమళమై వీస్తాడు.
భవిష్యత్తుని బొగ్గు గనులకి రాసిచ్చి
జీవితాంతం శరీరాన్ని నిప్పుకణికలా మండిస్తాడు.
అలాంటివాడు–తన కనీసావసరాలకోసం సమ్మెచేస్తే
చట్టాన్ని తమ ఆయుధాగారంగా మార్చుకున్న
పెట్టుబడిదార్లు
లాఠీల్ని, జైళ్ళనీ, కోర్టుల్నీ ఉసిగొల్పి
కార్మికుడి పైనే కళ్ళెర్రజేస్తారు
కుక్కకి స్థానబలమే ఉంటుంది
ఈ క్రూరమృగాలు నగరమంతా పరపతి కలిగుంటాయ్

అంతస్తుపై నుండే వాడి దృష్టి ఆకాశంలోనే
కేంద్రీకృతమౌతుంది
నేలమీదున్న వాడి చూపు అగాథంలోనే
కొట్టుమిట్టాడుతుంది
బటానీలమ్మేవాడు రిక్షాలాగేవాడు కార్లవైపే చూడడు
కార్లు తయారుచేసేవాడు – ఈ దేశంవేపే చూడడు

జేబులో చిల్లిగవ్వ లేకుండా బజారుకెళ్తే
బజారు బజారంతా బంజరు భూమై దర్శనమిస్తుంది
ఒక్క రూపాయి బిళ్ళన్నా లేకుంటే
వంకాయలూ బెండకాయలూ ఎగబడి ఎగతాళి చేస్తాయి

పుట్టుకతోనే ఎవడూ దరిద్రుడుగా పుట్టడు
మధ్యలో సృష్టించబడతాడు
కుట్ర జరిగి ధనమదాంధుడి చుట్టూ
కోటగోడగా నిర్మించబడ్డాడు

4

పుస్తకంలోంచి దులిపేసిన అక్షరాల్లా
లక్షలకి లక్షలు దేశమంతా నిరుద్యోగులై నిండుకున్నారు

చిన్నప్పుడు బడుల్లో...
సూర్యుడూ ఏడు గుఱ్ఱాలూ
భూమిని చాపలా చుట్టి చంకలో పెట్టుకోవడం
హనుమంతుడు లంకను తగలబెట్టటం
యిలాటి సరదా పాఠాలు విన్న ఆ పసికందులే..
ఆ పసిడి కలలే
నేటి నిర్జీవ విశ్వవిద్యాలయాలకి వేళ్ళాడదీయబడి
దిక్కులు చూస్తున్నాయి.
చివరకీ చదువులు
ఏ హోటల్ బేరర్‌గానో టాక్సీ డ్రైవరుగానో
తయారు చేస్తే ఫరవాలేదు.

ఒక్కొక్కప్పుడు నిర్దాక్షిణ్యంగా రైలు పట్టాల మీదిగ్గెంటి
కసి తీర్చుకుంటుంది
ఇది ఆత్మహత్య కానే కాదు
ఈ వ్యవస్థ చేయించిన అజ్ఞాతహత్య

వయసుతో పాటు ప్రకృతి సిద్ధంగా అంగాలు ఎదగటం
కూడా
ఒక రకంగా హత్యే
ఎందుకంటే
ఇది మానభంగాల దేశం

కామాంధుల నిలయం
చెరచబడ్డాక కోర్టులేం చేయవు కన్నీళ్ళేం చేయవు

మరి రోజు రోజుకీ వాగ్దానాల కుబుసాన్ని వదిలేసి
మన మధ్య సంచరించే–ఈ రాజకీయ విషనాగుల
మధ్య
కొత్త కొత్త చట్టాల జిళ్ళేళ్ళతో
జిబ్బు జిబ్బుగా తయారయ్యే ఈ ప్రభుత్వ కీకారణ్యం
మధ్య
బతికే దెవరు? బలిసేదెవరు?
అంతా దొంగలే....
ఘడియ ఘడియకీ నిత్యావసర వస్తువుల ధరల్ని
రేసు కుక్కల్లా ఉసిగొల్పే బ్లాక్ మార్కెటీరుగాడు–దొంగ
సిమెంట్ మింగి యిసుకనుమ్మేసే కాంట్రాక్టరుగాడు–
దొంగ–
పురాణాలూ పుణ్యక్షేత్రాలు ఎరచూపి
బొజ్జను పెంచే పురోహితుడు–దొంగ–
న్యాయాన్ని సత్తురూపాయి బిళ్ళచేసి బజార్లో కెగరేసిన
లాయరుగాడు–దొంగ

రోగాల్నీ మందుల్నీ డబ్బు చేసుకునే డాక్టరుగాడు దొంగ
నోరు తెరిస్తే లంచమడిగే గుమస్తా, ఆఫీసర్‌గాడూ దొంగ
బూతు బొమ్మలూ సెక్స్ సాహిత్యమూ బజార్లమ్మటమ్మి

– తద్వారా
బ్లూఫిలింలూ సిఫిలిస్‌లూ గనేరియాలూ అంటగట్టే
బూతు రచయితగాడూ పబ్లిషర్లూ – అంతా దొంగలే
యింకా అనేకానేక దొంగల రాజ్యం ఇది
ఆఖరికి...
స్పర్శజ్ఞానం కోల్పోయిన సినిమాతార చర్మాన్ని కత్తిరించి
మీ కళ్లకి గంతల్లా కట్టి
బలవంతంగా మీ జేబుల్లోంచి డబ్బు గుంజే
నిర్మాతగాడు–దొంగ

5

మరీ దొంగలబారి నించి హంతకుల నించి
క్రూరమృగాల నించి
దుర్భర దారిద్ర్యం మానభంగాలూ మతకల్లోలాల నించి
మూఢ నమ్మకాల్లోంచి
మనల్ని మనం రక్షించుకోవటం మన విధి

లేకుంటే ఒకనాడీ వ్యవస్థ మనందర్నీ తుడిచి పెట్టుకు
పోవటం ఖాయం

భవిష్యత్తుని జోతిష్యుడి చేతిలో పెట్టే 'ఖర్మ' బతుకు
బతకొద్దు
తనని తాను శాసించుకునే ఆత్మవిశ్వాసం కలిగుండాలి
ఇంకొకడు నీ జీవితాన్ని నామరూపాల్లేకుండా ధ్వంసం
చేసే హక్కెక్కడిది

జీవితమంటే ఊడిగం చెయ్యటం
కాదు–ఉద్యమించటమనీ
స్వప్నాల్లో పరిభ్రమించటం కాదు–శ్రమిస్తూ
సంఘటితమవటమనీ
నీరు కారిపోవటం కాదు–నెత్తురు దారుల్లో నడవటమనీ
త్వరగా తెల్సుకో –
రోజురోజుకో రక్తపాతం
అడుగడుగునా విప్లవ జ్వాల
నిన్నింకా రగుల్కొల్పటం లేదా... ?

అందుకే మరోసారి మరోసారి అరుస్తా

నువ్వు రైతువైతే

చెమట ముత్యాలు పొదుక్కున్న ధాన్యాన్ని

చూస్తూ చూస్తూ భూస్వాముల

గుమ్మాల్లో నింపటం – అన్యాయం

నువ్వు కార్మికుడివైతే

ఫ్యాక్టరీలో నీ రక్తం యింకి పోయిన ఫలితంగా

ఒక్క యాజమాన్యమే లాభాలార్జించటం–అక్రమం

నువ్వు విధ్యార్థివైతే

ఇన్నేళ్ళ నీ చదువూ శ్రమా సహనం

చివరికి రైలు పట్టాల మీదిగ్గెంటితే

ఘోరాతి ఘోరం –

నువ్వు స్త్రీవైతే

ప్రతిసారీ కామాంధుల చేతుల్లో పడి రక్షించుకోలేని

అబలవైతే

శతాబ్దాల నిశ్శబ్దంగా గడ్డకట్టుకుని పోతే

మరి నీ విశ్వరూప సందర్శన మెప్పుడు...?

# డాక్యుమెంటరీ

ఉదయమే
తెగిపడ్డ పావురం రెక్కలా
వార్తాపత్రిక –
పార్లమెంటు పైటలో వడకట్టిన విశేషాల్ని
పన్నీరుగా చిలకరించే
రేడియో –

మొద్దు బారిన రాజకీయ చర్మం మీద
వికారంగా
వాగ్దానాల ఉలిపిరికాయ

ఈ విధంగా ఆవిష్కరింపబడే ఈ దేశంలో
ఎమ్మెల్లే క్వార్టర్ గది గుప్పిట్లో బంధించబడి
ప్రతిధ్వనించలేని పనిమనిషి ఆక్రందన
నిశ్శబ్దంగా నిర్దాక్షిణ్యంగా కన్నీరై ఒలికిపోతుంది

గడ్డ కట్టిన కారంచేడు నెత్తుటి మడుగులో
అగ్రవర్ణాల అహంకారపు గొడ్డళ్లు మునిగి
ఉపరితలమ్మీద
ఆరుగురి హరిజనుల శిరస్సులు మొలిచి
హాహాకారాలు చేస్తుంటాయ్

కల్లోలిత ప్రాంతం గడియారంలో
అనుక్షణం భీతావహంగా కదిలే 'లాఠీ' 'బాయ్‌నెట్'
ముళ్లు
రాత్రింబవళ్ళూ
పేదరైతాంగం గుండెల్లోనే కొట్టుకుంటాయ్
గోడల మీది వ్రాతలు –
దృశ్యాదృశ్యంగా దేశాన్ని నగ్నత్వంలో
నిలబెడుతున్నందుకు
గోండుజాతి –
దోపిడీ సిద్ధాంతాల్ని తిరస్కరిస్తున్నందుకు
పగుళ్ళు జూపిన పెత్తందారీ భూమిలో –
పేదరైతు చెమట వర్షించనందుకు .....
పర్యవసానంగా –
ప్రతీకారంగా
పరాభవపు మచ్చల్తో
పౌరజీవితాన్ని కాటేస్తూ ఉంటుంది పాలకవర్గ
విషసర్పం

2

చెమట సారం పీల్చుకుని
పెట్టుబడుల ఇంద్రధనుసులు
పుష్పిస్తూనే ఉంటాయ్

'గరీబీ హఠావో' నినాదం
రాజకీయ పరిభాషలో బుల్డోజరై
గుడిసెవాసుల ఆశల్ని నేల మట్టం చేస్తుంది

చీకటి బజారంతా విస్తరించుకుని
హాజీమస్తాన్ యూసఫ్ పటేళ్ళూ
మేలిమి వజ్రాలై పరిపాలిస్తుంటే

హైద్రాబాద్ వనంలో
'ఆబిద్' కరెన్సీ పుష్పంలా
విరాజిల్లుతూనే ఉంటుంది.

కుట్ర ఫలించి
భీవాండీ తానే శరీరాలపై
మతం రోమాలు నిక్కబొడుచుకుని
విషపు కత్తులైతే

రోజుల తరబడి చార్మినార్ మెడలో
కర్ఫ్యూ కపాలం వేళ్లాడి
గగుర్పాటు కలిగిస్తుంది

మతం పెంచి పోషించబడి, ఉసిగొల్పబడే ఈ దేశం
కాష్ఠంలో,
స్వర్ణదేవాలయంలో రక్తపాతమే పరాకాష్ఠ –
మతంతో బాటు ముక్తి మార్గాలు ఉద్బోధించబడతాయి

గనుక
ఈ దేశంలో
రోజూ బాబా గాడి గడ్డాలకు
వేలాది భక్తులు వేళ్ళాడుతుంటారు

పాపిష్టి డబ్బు పెరుగుతున్నప్పుడల్లా
తిరుపతి హుండీ గర్భస్రావం చేయించుకుంటుంది
రాయి ఆశీర్వదిస్తే
అజ్ఞానం సాష్టాంగ నమస్కారం చేస్తుంది

3

'జలగ'లూ 'బ్రహ్మ' జెముళ్ళూ
అవకాశవాది 'రూలుకర్రా'
'ఆరణాల కూలీ'
'పునాది' లేని 'భవనం' నాచారం 'సన్యాసు'లూ
వరుసగా ఎవరెవరు ముఖ్యమంత్రులైనా
ఇరవైనాలుగ్గంటల కుట్ర ఇంకొకడ్ని ప్రమాణస్వీకారం
చేయించినా –
అక్షరాలా అరాచకంలో మార్పుండదు
గాంధీ చచ్చిపోయినా బోసి నవ్వు కురిపిస్తూనే
వుంటాడు.
గులాబీలతో నెహ్రూ పరిమళిస్తూనే ఉంటాడు

ప్రజాస్వామ్యం మాత్రం ప్రతిరోజూ
నెత్తురోడుతున్న దృశ్యాలతోనే ప్రత్యక్షమౌతుంది
పట్టపగలు ఈ దేశాన్ని
బౌద్ధ స్తూపం కింద హత్య చేసినా
ప్రశ్నించే దిక్కులేదు

4

ఇక్కడ అఆ ఇఈ లు ఎ బి సి డి లు అంబాడి
బుడి బుడి అడుగుల ప్రైమరీ స్కూళ్ళై
పెరిగి–కాలేజీలై
యూనివర్సిటీల గడ్డాలు పెంచుకుని
ఉద్యోగాల భిక్షాటనకు బైల్దేరతాయ్

పత్రికలపైన పాదాలు మోపి
ఆకాశంలోకి గొంతు విప్పి
సమూలంగా నిరుద్యోగ నిర్మూలన గావిస్తామని
దగా రాజకీయాలు అరుస్తూనే ఉంటాయ్

రోజుకో కిర్సనాయిలు డబ్బాలో
అడపా దడపా హుసేన్ సాగర్ అలల అద్దంలో
స్త్రీ జాతి దౌర్భాగ్యం ప్రతిఫలిస్తూనే ఉంది

వరకట్న దురాచారం రూపుమాపుతామని
తమ పదవుల వేదికల పైన వైభోవోపేతంగా
కూతుళ్ళ కళ్యాణ మంటపాల్నల్లుకుంటాయ్
లక్షల రూపాయల చందాలతో
కుళ్లు రాజకీయ మహాసభలు మొలిచి
కుక్క గొడుగుల్లా రాలిపోతాయ్ –
కోటానుకోట్లు వెలగపండులా మింగి
ఏసియాడ్ ఏనుగూ తోక ముడుచుకు
వెళ్లి పోతుంది –
పుట్టే ప్రతి శిశువు వీపు మీదా
ఐ.ఎం.ఎఫ్ ముద్ర వెయ్యమని
శాసించటం జరుగుతుంది –
అల్లావుద్దీన్ దీపం
అక్షయపాత్ర
అన్నం పెట్టవు గనుక
దిస మొలల్తో దరిద్రం–దేశమంతా
ఊరేగుతుంది
ఎక్కడి బతుకులక్కడ అఘోరిస్తుంటాయ్
ఎలుకలా ఒక తేదీ
కాల రంధ్రంలోకి దూరిపోతుంది

## 5

స్వయంగా శవాలే
రాబందుల వద్దకి
నడిచొస్తుంటే

అంతకంతకూ
పెరుగుతున్న
ఆజ్ఞాన పర్వతం
చిన్న బ్యాలెట్ పెట్టెలో
యిమిడిపోతే

మళ్ళీ
కోటీశ్వరుడి పుట్టలోంచి
బుసకొట్టేదే
ఈ దేశపు 'ప్రజాస్వామ్యం'....

## 5 సంక్షోభ గీతం

ఎడతెరిపి లేని దగ్గు, అడుగు కదపనివ్వని ఆయాసం,
రక్తం ముద్దలుగా పడుతున్న రోజుల్లో కూడా
నేను కవిత్వాన్ని నిర్లక్ష్యం చేయలేదు నాలోని విలువల్ని
భగ్నం చేసుకోలేదు
నా ప్రాపంచిక దృక్పథాన్ని వీడి ఏ ప్రలోభాలకు
లోబడలేదు
ఆఖరికి కాలిధూళితో సమానమైన కలర్ సినిమా
గ్లామర్‌ను సైతం
నా కళ్లల్లో పడకుండా జాగ్రత్త పడ్డానే తప్ప
ఎటువంటి కుళ్ళు మార్గాలకు తలవొగ్గలేదు
మనోహరాకాశంలో ఎగిరే కొంగ మొదలుకొని
మదరాసు లోని కొంగర జగ్గయ్య వరకూ 'నా కవిత్వాన్ని
అమితంగా ప్రేమిస్తారని తెలుసు

## కవితల క్రమం

## సూర్యుడే నా ముఖచిత్రం

ఎన్నెన్ని
గాయపడిన ఉదయాల్ని
సంకలనంగా కూర్చినా

ఎవరెవరి
బాధామయ గాథల్ని
ఈ కలంతో జాలువార్చినా

మిత్రుడా
నిరంతరం
సూర్యుడే నా ముఖచిత్రం

## ఆయుధాన్ని అధ్యయనం చెయ్

కత్తి అంచు మీద
తడితడిగా నెత్తుటి బొట్టు
తచ్చాడుతున్న వేళ
కనుకొలకుల్లోని అశ్రుబిందువే
అగ్నికణమై కురిసేందుకు
సంసిద్ధమౌతున్న సమయం
ఆయుధాన్ని అధ్యయనం చెయ్

శ్రమజీవి కండరాలపైని స్వేదబిందువుని
అదృశ్యశక్తులు
అపహరించే వేళ
దోపిడీని అధ్యయనం చెయ్

మోడు
ఎముకల గూడై
అర్థించే ఆకలి కొమ్మల చేతుల్నీ
అనుక్షణం
అంతస్తుల రాతి పాదాల కింద పడి విరిగే
ఈ దేశపు దారిద్ర్య జీవన శిథిలాల్నీ
అధ్యయనం చెయ్

విద్యార్థి చీకటి బతుకుల్ని
విద్యుదీకరించలేని
విశ్వవిద్యాలయాల్నీ
విస్తృతమౌతున్న కాగితపుటెడారుల్నీ
అధ్యయనం చెయ్

అన్నీ అధ్యయనం చెయ్
బలివితర్ది వంటి బ్యాలెట్ పెట్టెనీ
బూటకపు ప్రజాస్వామ్యాన్నీ
అధ్యయనం చెయ్

ప్రవహించే నెత్తుటి నది ఒడ్డున
మనిషి
ఆయుధంగా మొలకెత్తటమే అనివార్యమైన
భౌతిక పరిస్థితుల్నీ అధ్యయనం చెయ్

మనిషి మాత్రమే ఆయుధం కాదు
పరిణామక్రమంలో
పదునెక్కిన ఒక ఆలోచన ఆయుధమౌతుంది
దోపిడీ శక్తుల్ని కూల్చే
సిద్ధాంతమొక ఆయుధమౌతుంది

రోమ్ నగర విలాసాల వేదికపైకి
మల్లయుద్ధప్రవీణుల్ని
మాంసం ముద్దలుగా ఎగదోసిన పర్యవసానానికి
నీగ్రోల గుండెల్లో  చెలరేగిన మంటే
మహత్తర ఆయుధమౌతుంది
పోరాటం అనివార్యమైనప్పుడు
రక్తసిక్తమైన చరిత్ర పుటలూ
మనిషిని భయపెట్టవు
సైన్యం ఆకులు రాలి
పట్టణాల కొమ్మలు విరిగి
పడిపోయిన ప్రపంచయుద్ధాల చెట్టూ
భయపెట్టదు
ఆయుధాన్ని అధ్యయనం చెయ్

# దృశ్యం

పారదర్శకంగా కురుస్తున్న
రక్తవర్షం
చెమటనదిగా
రూపాంతరం చెంది
ప్రవహించటం
మీరెపుడైనా చూశారా

హరితహరితంగా
నల్లరేగడి నేలమీద
సృజియించిన
నాగళ్ళ లిపిని
మీరెపుడన్నా చదివారా

కర్మాగారాల కొలిమిలో
కణకణా మండుతున్న
కండరాల ఎరుపుని
మీరెపుడైనా కనుగొన్నారా

యింతకూ
పాలరాతి బొమ్మైనా
పార్లమెంటు భవనమైనా
వాడు చుడితేనే శ్రీకారం
వాడు కడితేనే ఆకారం

# గుండె గుండెకీ మధ్య

పిడికెడు మట్టిని
మైదానం చెయ్యగలిగిన వాన్ని
పిడిబాకుని
కరవాలంగా మార్చలేనా

అనంతాకాశక్షేత్రంలో
అక్షరాన్ని
సూర్యబింబంగా నాటగలిగినవాన్ని
ఒక పోరాటకెరటాన్ని
యుద్ధనౌకగా
తీర్చిదిద్దలేనా

చిందించిన నెత్తుటితో
చీకటి కోణాలన్నీ వెలిగించగల
యోధున్ని
గుండె గుండెకీ మధ్య
విప్లవ వారధుల్ని
నిర్మించలేనా

# నీ గాజు కళ్ళు దేన్నీ రాజుకోవు

అంతర్నేత్రం తెరిచి
నువ్ దర్శించగలిగితేగా
గాలి గర్భంలో తుఫాను శిశువూ
కాలగమనంలో నెత్తుటి రుతువూ
నిక్షిప్తమౌతాయని

నీ రక్తంలో రసాయనిక  చర్యంటూ
జరిగి తీరితేగా
ఒక ఎర్రజీర
నేత్రారణ్యమంతా విస్తరిల్లి
కార్చిచ్చై రగుల్కొనేందుకు

అసలు నువ్వెప్పుడన్నా
నా ఆలోచన ఆయుధాగారం
తెరిచి చూస్తేనా
లక్షలాది పీడితుల పిడికిళ్లే
నా అక్షరాలని

అందుకే
నీ గాజుకళ్లు దేన్నీ రాజుకోవు
గుండెమీద ఏ దృశ్యాన్నీ గీసుకోవు

# జ్వలించే అక్షరం

అక్షరం
కపాలం కంతల్లోంచి వెలికివచ్చే
క్షుద్ర సాహిత్యపు కీటకమూ కాదు
సౌందర్యం చర్మ రంధ్రాల్లో
తలదూర్చే ఉష్ట్రపక్షీ కాదు

అధునాతనంగా
వధ్యశిలపై వాలిపోయే నిస్సహాయ శిరస్సూ కాదు
అక్షరం
జ్వలనా జ్వలనంగా ప్రకాశించే సత్యం
స్వచ్ఛంద స్వప్నాల అంకురం

అక్షరం
కాలం చేతుల్లో ఎదిగి
చరిత్ర భుజస్కంధాలకందివచ్చే ఆయుధం
ఉద్యమ శిఖరాల మధ్యనించి
సంధించిన
ప్రతిఘటనా కిరణాల ప్రామాణికంగా
అక్షరం
ప్రచండ సూర్యగోళం

## నాటు తుపాకి

డబ్బులోనాని నాని
ఉబ్బిపొయ్యే
అవకాశవాద శవాల్లారా
పదవుల కుర్చీల్ని
పట్టుకు వేళ్ళాడే
గబ్బిలపు ముఖాల్లారా
నా బాధ మీది కాదు

కులాల పుళ్ళపై
కుళ్ళ బొడుస్తున్న
రాజకీయ కుతంత్రమా
శ్మశానంలో
శాంతి దీపాలు వెలిగించే
ప్రజాస్వామ్య ప్రభుత్వమా
జ్ఞానోదయ కిరణాలు సోకని
పురవీధుల గుండా
తరిలివెళ్తోన్న
బుద్ధవిగ్రహ మహోత్సవమా
నా బెంగ మీగురించీ కాదు
ఆంధ్రదేశపు
ఆశయాల షామియానాకి
ఆకలి చావుల తోరణాల్ని కుట్టి

ఆదిలాబాదడవుల్లో
శాంతి భద్రతల్ని జో 'కొట్టి'న
ఖరీదైన కాషాయమా

అగ్రరాజ్యాల అప్పుని
గోవర్ధన పర్వతంలా
చిటికెనవేలి పైకెత్తి
గోర్బ'చెవ్'లో గుసగుసలాడిన
అందమైన రాజీవుడా
నా బెంగ మీ వల్లాకాదు

నా బాధల్లా
బెంగల్లా...
దిగులల్లా...
ఎంతకీ పేలని
నాటు తుపాకీ లాంటి సగటు మనిషి గురించీ -
మండని మందుగుండువంటి వాని గుండె గురించీ-

## సంక్షోభ గీతం

మృత్యు వృక్షం
శాఖోపశాఖలై
కపాలాలే ఫలాలైన
భయానక చిత్రాన్ని
ఆవిష్కరించినా

రుతువులన్నీ
రక్తసిక్తమై
పత్రహరితమే
కోల్పోయిన
ప్రాపంచిక పరిణామాల్ని
పరిశోధించినా

వర్తమానం
రెండంచుల మధ్య
విస్తరించిన
మారణాయుధమే
సమీక్షించినా

కల్లోల తరంగాల మధ్య
చిక్కి
ఆధునిక మానవుడే
సాక్షాత్కరిస్తాడు

అణ్వస్త్రాల తెరపై
కృత్రిమ శాంతి పావురం ఎగిరి
బుసకొట్టేడాలర్ విషసర్పం
రూపాయి కుబుసం వొదిలి
అందంగా కనిపించినా

బహుళజాతి
కుటిల నీతి
భోపాల్ కనుపాపల్లో
సూదులుగా పరిణమించి

విషరాజకీయాల ఊబి
సామాన్యుడి బతుకు చుట్టూ
విస్తృతిస్తుంది

* * *

ధాన్యపు గింజవొలిస్తే
రైతు అస్థిపంజరం రాలిపడే
దయనీయ దృశ్యమే
ఫలసాయమై
కమిలి పోయిన
కార్మికుడి దేహమ్మీద వాలి
యంత్రాల
యినుప గోళ్లతో
రక్కెయ్యటమే
పారిశ్రామికీకరణై

దారిద్ర్యరేఖల మధ్య
ఊహా మాత్రంగా
పులిమిన పథకాల పచ్చరంగే
ప్రగతి రథమై
శిథిలాలతో నిర్మించిన
కళాఖండమే

మన భరతఖండమౌతుంది

* * *

వాగ్దానాల ప్రేవుల్ని
మెళ్లో వేసుకు ఊరేగటమే
రాక్షస రాజకీయాల సాంప్రదాయమై

దళారీ దగుల్బాజీ విధానమే
దేశం ధమనుల్లో
ప్రవహిస్తున్న రక్తమై
కృత్రిమ విజ్ఞాన శిఖరాలు
పెరిగి
నిరుద్యోగపు లోయల్ని
సృష్టించటమే నిజమైతే
ఈ దేశంలోని
డిగ్రీకాగితాలన్నీ
ఉగ్రవాదాన్నే
ఉత్పత్తి చేస్తాయి

* * *

ఎనభై అడుగుల
ఎత్తుకి ఎగసిన
ఎన్నికల కటౌట్ల
గాలిమేడలు కూలిపోయి

ప్రణాళికలు
చౌరస్తాల పాదధూళితో మమేకమై
మైల పడితే

బ్యాలెట్ పెట్టెలో
ఈ దేశం
భ్రూణహత్యే సత్యమై
సచివాలయాలూ
విధాన సభలే
సగటు మనిషి ఓట్లవిత్తనాలు
మొలకెత్తని బంజరు భూములై
పరిహసిస్తే

చాలీచాలని కడుపుని
ఏ చారిత్రక ధర్మంతో కొలిచినా
విప్లవాగ్నే రగుల్తుంది

జీవన లాలిత్యమే చితికిన
లాఠీల కాఠిన్యంలో
హంతకులెవరో ఎరుగని
నేరాల నేపథ్యంలో
సంకెళ్లే స్వేచ్ఛయిన
స్వాతంత్ర్యం పరిభాషలో
అరాచకమే అధికారమై
ప్రబలుతున్న రాజ్యంలో

అరణ్యాల్ని ఆయుధాలుగా
ధరించి
సంధించినా
త్యాగాల తోరణాల్లో
ఉద్యమ ద్వారాలు
తెరిపించినా
కాలమే స్వాగత గీతికై
తరతరాల పీడితుడి పక్షమై
నిలవదా...! గెలవదా...!

## లెటస్ గో

గొంతు విప్పితే
భాస్వరమై మండుతున్న వేళ
గోనె సంచిలో
శవ సాహిత్యాన్ని మోసుకెళ్తుంటాడొకడు

అక్షరాన్ని అస్త్రంగా సంధిస్తున్న వేళ
అశ్లీలంలో
ప్రేమామృతం చిలుకుతుంటాడింకొకడు

విప్లవోద్యమంలో విలీనమై
అక్షరం
అలలు అలలుగా ఉప్పొంగుతున్న వేళ

అనుభూతి గోతిలో ముడుచుకుని
జీవిత మహోత్సవాల్ని
"కంటూ" ఉంటాడు మరొకడు

లెటస్ గో మై ఫ్రెండ్స్
మనమైతే అక్షరాన్ని
సెర్చిలైట్, డైనమైట్‌గానే వినియోగిద్దాం.

## విషాద సాక్షాత్కారం

కన్నీళ్ళని ఏ భాషలోకి అనువదించినా
విషాదం మూర్తీభవించిన స్త్రీయే
సాక్షాత్కరిస్తుంది

ఎక్కడ కన్నీటి తరంగాలుప్పొంగినా
అచేతనంగా
అలల చేతుల మీంచి రాలిపడిన
అభాగినే దర్శనమిస్తుంది

ఏ కన్నీటి చారికో
పిడిబాకై మెరిసిన ఉదంతం తప్ప
నిరంతరం కన్నీళ్ళు ప్రవహిస్తూనే వున్నాయ్

నాలుగేళ్ళ మృదుత్వం
"మానభంగం" శీర్షిక కింద
పడి చితికిన హృదయ శకలాల్నించీ
కళాశాల గోడలే కబంధ హస్తాలై
కబళించిన విద్యార్థినుల జీవితాల్నించీ
కన్నీళ్ళు ప్రవహిస్తూనే వున్నాయ్

అక్షరాన్ని వివస్త్రని గావించి
అమ్ముకునే
అశ్లీల సాహిత్యం నించీ
మోడుని
పుష్పాలతో అలంకరించే
"మోడల్" కళావిన్యాసాల్లోంచీ
విషసంస్కృతీ వేదికపై ప్రబలిన
అంతర్జాతీయ
అందాల పోటీ ప్రలోభాల్లోంచీ
స్త్రీ పురుషుడికి
శిరోధార్యమనే మోసపూరిత మాటల్నించీ
కన్నీళ్ళు ప్రవహిస్తూనే వుంటాయ్

"కామాటిపురా" మరబొమ్మల్లో చేర్చబడిన
శిథిల జీవనదృశ్యాల్నించీ

కట్నం పేనిన, పేర్చిన
ఉరితాళ్ళూ చితిమంటల్లోంచీ
జన సందోహాల్లో నిర్లజ్జగా
థియేటర్ల నడుం చుట్టేసుకుని
పొడుగాటి "క్యూ"ల చేతులు సాగినకొద్దీ
పొడసూపే
భారీ కలెక్షన్ల కృత్రిమ వక్షోజాల
ఉబ్బెత్తుల మీంచీ
కన్నీళ్లు ధారాపాతంగా ప్రవహిస్తూనే వుంటాయ్

నాజీల అహం
నగ్నంగా స్త్రీలని ఊరేగించిన
ఊచకోత జ్ఞాపకాల్లోంచీ
నాగరికత బ్లూఫిల్మై
బుసకొట్టే కామకేళీ చిత్రాల్లుంచీ
కన్నీళ్ళు ధారాపాతంగా ప్రవహించి
ఘనీభవించే వుంటాయ్

ఎంత అధునాతనంగా ఎదిగినా
అశ్రు బిందువునించి
స్త్రీ కింకా విముక్తి కలగలేదంటే

నిజంగా కన్నీరు సముద్రమై
నిజంగా కన్నీరు సముద్రమంత ఆవేశమై
ఉద్యమాల హోరెత్తితే గానీ
ఈ  దోపిడీ దౌర్జన్యాల భూభాగాన్ని
ముంచెత్తలేదు.

## ఎవరమ్మా నువ్వు

రాతి హృదయంలో
యిమడని
అశ్రు పుష్పంలా

జాతి గుండెల్లో
రగులుతున్న శోకదీపంలా
ఎవరమ్మా నువ్వు

శతాబ్దాల
శిథిల శాసనాల్ని
మోస్తున్న శాపంలా

ప్రభుత్వాల
అత్యాచారాల్నే
కప్పుకున్న మానంలా

చెరచబడ్డ కాలమానంలా
ఎవరమ్మా నువ్వు
యిలారా!

ఈ ఆయుధాల నీడ కింద
సేద దీర్చుకో...
మా ఆశయాల సాధనలో
మమేకమైపో....

## భయం అరల్లో

స్వచ్ఛందంగా
స్వేచ్ఛాగాలులు పీల్చేందుకు
మట్టిపొరని చీల్చుకొచ్చిన
మొక్కలా
మొక్కవోని సాహసంతో
నిలవాలి గానీ

నల్లిలా
నత్తగుల్లలా
ప్రతిక్షణం
భయంతో ముకుళించుకుని
భయం అరల్లో దూరిపోయే
ఎవడ్రా నువ్

# వీరుడితో కరచాలనం

మీ కనుపాపల్లో చితికిపోయిన చూపుల్నీ
మీ స్వరపేటికలో చిక్కుకున్న బాధల్నీ
మీ గుండె గది మూలల్లో పేరుకున్న శిథిలాల్నీ
పరిశోధించేందుకు నాకిక సమయం లేదు

మీ బ్రతుకుల్లో దోబూచులాడుతున్న దరిద్రాన్నీ
మీ దరిద్ర మహా సముద్రాల్లో
ఓలలాడుతున్న స్వర్గధామం ఓడల్నీ
విశ్లేషించేందుకు నాకిక సహనం లేదు

దారిదారంతా దగ్ధమౌతున్న తీరునీ
దగాపడ్డ తమ్ముళ్ళనీ
ఓదార్చేందుకు నాకే అస్కారం లేదు
ఈ వ్యవస్థ రాక్షస రతిలో
మీరు కోల్పోయిన శీలం విలువెంతో
కొలిచేందుకు కుమిలేందుకు
నాకు హృదయం లేదు

జీవితాంతం
కన్నీటి చారికనే కాలిబాట మీంచి నడుస్తున్న
బాటసారికి నే వీడ్కోలు పలుకుతున్నా

జీవితాంతం
కలల మృతకళేబరాలు కాలుతున్న చోట
శ్మశానంలా రోదిస్తున్న వాడికి నే వీడ్కోలు పలుకుతున్నా
శత్రు శిబిరం ముందు
అస్త్ర సన్యాసం చేసిన
అహింసా సిద్ధాంత ప్రవక్తలకి నే వీడ్కోలు పలుకుతున్నా
సామూహిక సమాజాల శవమ్మీద
ఎన్నికల కాగితప్పూల పరిమళాలు వెదజల్లేవాన్నీ
ఏకధాటిగా కొనసాగుతున్న హత్యాకాండని
ప్రజాస్వామ్యమని బుకాయించే వాన్నీ
కన్నీళ్ళతో ఎదుర్కోలేం
వేనవేల దీపాల గొంతు నులిమి
తమ చీకటి రాజ్యంగా ప్రకటించుకున్న చోట
మిణుగుర్లతో దాడి సల్పలేం
మన రక్తనాళాల్నే
దోపిడి రహదారులుగా ఏర్పరచుకున్నవాన్ని
మన స్వేద జలంలోనే
షార్క్ చేపగా విహరిస్తున్న వాన్ని
మనం శాంతి ప్రవచనాల్తో సంహరించలేం
అందుకే
కాలాన్ని ఖడ్గంగా పైకెత్తగల
గాయాల్ని దిక్సూచిగా ప్రసరించగల
వీరుడితో కరచాలనం చేస్తున్నా...

# నువ్.. క్షమార్హుడివి కావు

యధేచ్ఛగా
నీ శరీరం బీరువా తెరిచి
వెచ్చని
నీ రక్తమాంసాల్ని కొల్లగొట్టే
బందిపోట్లెవరో నీకు తెలుసు
సుతారంగా
నీ ఆకలి పేగుల సితారపై
సరికొత్త
దోపిడీ సంగీతాన్ని సమకూర్చిన
కుహనా మేధావులెవరో నీకు తెలుసు

నీ చిరు చిరు
ఆశల కుటీరాల్ని
విధ్వంసం గావించే
అరాజకీయ బుల్డోజర్లెవరో నీకు తెలుసు

అయినా
పెదవి విప్పి మాటన్నా సంధించవు
శత్రువుపై పట్టు సాధించవు
చివరికి...
ఉద్యమ రహదారుల్లో విలీనమైన వాళ్లకి
ఒక రహస్య కేతనమైనా ఎగరెయ్యవు

# సిటీ లైఫ్

*6*

సిటీ లైఫే నా సమగ్ర కవితా స్వరూపానికి
కొలబద్దా కాదు
సుదీర్ఘ కవితా ప్రకంపనాకాదు.... కానీ
ధ్వంసమై పోతున్న సమస్త మానవ
విలువల్నీ, హింసా రాజకీయాల్ని
నిరసించడంతో పాటు నిప్పు కణికల్లాంటి,
కన్నీటి గుళికలు
ప్రతిరోజు ఆంధ్రజ్యోతి పాఠకులకు
అందించే చిన్న చిన్న కవితలు

## కవితల క్రమం

*సిటీ లైఫ్ కవితలు* : *159 నుండి 322 వరకు*

*(1987 నుండి 1993 దాకా*

*ఆంధ్రజ్యోతి దిన పత్రికలో వచ్చిన*

*సిటీ లైఫ్ శీర్షికలోంచి)*

1

పాఠశాలకొక టీవీ
తీసిపోని తెలుగు టీవి
వాహ్!
చెట్టుకిందె తరగతులు
దిసమొలలే యూనిఫామ్

2

కట్టుకుంటే
పలకనే ప్లాటు మీద
అ, ఆ లే
అంతస్తులు....
పేర్చుకుంటే
బతుకనే మాట మీద
డిగ్రీలే
పేక మేడలు....

3

స్కోరెంత....?
ఈ రోజు ఆటలో జోరెంత...?
ఆఫీసులో
ఫైలుకి పట్టిన బూజంత....!
ఎల్‌కేజీ ఎగవేసిన
బుజ్జిగాని మోజంత...!!

4

సిజేరియన్

బతికిస్తే

సజ్జనుడు

చంపేస్తే

సివిల్

సర్జనుడు

5

ముడుపులు

ముట్టినవారి బతుకే

మూడు చికెన్‌లూ

ఆరు సీసాలూ

మన కడుపుల్లో

ఏముంటయ్

చిన్న ప్రేవులూ

పెద్ద ప్రేవులూ

6

నగరాల్లో

అత్యధికంగా

అత్యద్భుతంగా

అస్థిపంజరాల్ని
చెక్కే
ఉలి
ఆకలి.......

7

లారీలు
దళారీలతోనే
సాగదండి
రవాణా
కూలీలూ
హమాలీలె
ఎత్తాలి
మొదటి బరువు

8

కాచిగూడా
కాచి వడబోస్తే
నువ్వొక నీళ్ల టీ!
నారాయణగూడ
నీమీంచి నడిచిపోతే
నువ్వొక దాల్ రోటీ!!
బతకొచ్చిన కష్టజీవీ
పట్నంలో
నీకు పోటాపోటీ...!!

## 9

నగారా మోగిందా,
నయాగరా దూకిందా,
నాలుగు రోడ్ల కూడలిలో ఏమది?
అదే, నగరారణ్యాహోరు.
నరుడి జీవన ఘోష

## 10

నిద్రలోకి జారుకుని
తేరుకునేలోగా
చిప్ప బోర్లించినట్టు
నెత్తిమీద జుట్టు
ఓహో మంగలి
నీకిదే   నమస్సుమాంజలి..!

## 11

చరిత్రకి కొదువలేదు
మన టాంక్‌బండ్ భుజమ్మీద
మోసే
శిలావిగ్రహాలకీ కొదువలేదు
ఎటొచ్చీ
హుసేన్‌సాగర్ నీళ్లలా
వ్యయమయ్యేది
ప్రజాధనమే –

## 12

డబ్బు మనిషిలా నువ్వు-
జబ్బు మనిషిగా నేను-
అందుకే
నువ్వెప్పుడూ డాక్టరువి
నే పేషెంటుని!

## 13

అవును
పాలూ గుడ్డూ
పోషక పదార్థమే
మరి
గరీబోడికేదీ
గాడిద గుడ్డూ!

## 14

అట్ట పర్వతం
ఎత్తి పట్టుకున్న వాడు
ఆంజనేయుడూ కాదు
నెత్తిలో
నెమలీక పెట్టుకున్నోడు
క్రిష్ణపరమాత్ముడూ కాదు
అదంతా
ఎన్నికల 'అట్ట' హాసం!

## 15

ఆకాశానికే
ఆకర్షణ శక్తుంటే
ఎవ్వడూ ఏదీ
కూడబెట్టకపోను

## 16

రీసెర్చి స్కాలర్లెందరు
గడ్డాలు పెంచి తిరిగినా
నిత్యం
నున్నగా షేవ్ చేసుకుని
నిగనిగా మెరిసేది
ఆర్ట్స్ కాలేజ్

## 17

ఒక రూపాయి బిళ్ళుంటే
చూపుడు వేలిపై నిలిపి
విష్ణు చక్రంలా తిప్పుతా
రెండుంటే
రంధ్రాలు పొడిచి
బండి చక్రాల్లా అమర్చుతా
లక్షలకి లక్షలుంటే
మిమ్మల్నంతా
నా చుట్టూ ప్రదక్షిణ చేయిస్తా

## 18

ఉమెన్స్ కాలేజీ
గేట్ల ముందు
ప్రేమని పాదరసంలా
జారవిడుచుకునే
బాబులూ....
మీకేమీ లేవారా
జాబులూ....

## 19

'బంద్' బందూకుని
పేల్చినప్పుడల్లా....
నగరాలన్నీ
నిర్మానుష్యమే
నరనరాన
రాజకీయ కాలుష్యమే -

## 20

కాసుకో
కోసుకో
రాజకీయమా!
ప్రజలు
పనసతొనలు
మీరు
కత్తిమొనలు!!

## 21

నెత్తుటి సెలయేరు
పదహారు...
ప్రచండ సూర్యుడు
పదిహేడు....
ఆ పదునైన వయసే
ప్రమాదాల అంచురా
చూసినదు!
చూసినదు!!

## 22

శిథిలావస్థలో నున్న
రూపాయి
రెండుగా చీలి
దారిద్ర్యానికి దారిస్తే
తల దాచుకోనా
లేక
తల బాదుకోనా!?

## 23

మహదానందంగా
మన మెదళ్లని తొలిచే
జంట పురుగులు
తెలుగులో
దర్శక నిర్మాతలు!

## 24

క్రిక్కిరిసిన జనంతో
ఎప్పుడూ
చిక్కువిడని
పాపిట–
సాయం సమయాలన్నీ
గుప్పుమనే
వ్యాపార పరిమళమే
సుల్తాన్ బజారు దోసిట

## 25

స్వీపరూ
గేటు కీపరూ
లేక
ఊహించుకో
ప్రభుత్వ కార్యాలయాలన్నీ
పరమ పెంటే

## 26

బస్, రైల్వే ఛార్జీలే
కాదు
యిక్కడ
లాఠీ ఛార్జీలూ
ఎక్కువే

## 27

అనునిత్యం

ఆకలితో అలమటించే

దారిద్ర్యపు కత్తి

అకస్మాత్తుగా

ఏ ఐశ్వర్యం ఆపిల్ పండునో

కోసేస్తే

ఈ దేశంలో

దోషెవ్వడు...?

దోపిడీ దారెవ్వడు...?

## 28

ఆకాశమంత

ఆకలిలో

అన్నం మెతుకంత

చందమామ–

కంటికీ ఆనదు

కడుపూ నింపదు!

## 29

గడియారం

పెట్టుకున్న

ప్రతివాడూ

పరిగెడుతున్న

కాలాన్ని

పట్టుకోలేదు

## 30

ప్రసవ వేదన గదుల్లోంచి

గావు కేక...

చావు కేక...

తల్లీ!

బిగపట్టిన నీ శ్వాస నుంచి

ఊపిరెవరు.....

పాపలెవరు.....

## 31

అంబులెన్సులో

అమర్చిన

బాంబు

అయ్యో

మన జీవితంబు

## 32

వెల వెల బోయిన
వెయ్యి దరఖాస్తుల్ని
సమీక్షిస్తే....
మిగిలేది
ఒక ఉద్యోగం కెలికిన
గాయమే!

## 33

"చందమామ రావే
జాబిల్లి రావే"...
బదులు
ఇకనుంచీ
"దిగి దిగి రావే
దినపత్రిక రావే"...అని
దివ్యంగా
పాడుకోవచ్చు

## 34

జీవితాంతం
వొంటిమీద
నూలు పోగు లేకుండా
కల్లు గీసేవాడూ

నేత నేసేవాడే

మన నేతాజీ కలలుగన్న

మరో ప్రపంచం...!

## 35

నను

తొలిచే

బాధల ఉలే

నను

మలిచే

కవితా శిల్పం

## 36

సెంటుభూమీ

సిమెంటు రేణువూ

లేనోడి బతుక్కి

బతుకంతా

దరిద్రమే

సెంటిమెంటు!

## 37

విస్తృతిస్తున్న
జనమైదానాల మీద
మొలకెత్తుతున్న
పోరాట బీజాలెవరు?
విప్లవోద్యమానికి
కుడి ఎడమ
భుజాలెవరు??
ప్రజలే!!

## 38

ఉదయమే
బస్సుల్లో, రిక్షాల్లో
పేవ్‌మెంట్లపై
విరబూసిన
కాన్వెంటు పువ్వుల సందడి
రాలే చదువుల పుప్పొడి

## 39

క్రిక్కిరిసిన జనాన్ని
మోసుకెళ్లే
ఓ సిటీ బస్సుని
పట్టుకుని

ఏ 'పరేడ్ గ్రౌండ్స్'లో
దులిపినా
అదో బహిరంగ సభే!

## 40

సిరాబుడ్లు తాగి
కాగితాలు నమిలితే
కవిత్వం పుట్టదు
పెన్నుతో
సమాజాన్ని
సిజేరియన్ చెయ్యాలి

## 41

చెక్కీ చెక్కని
ఆశయాల
బొమ్మ –
చిగురించని
ఆశల
చిటారుకొమ్మ –
ఏ కొత్త సంవత్సరమూ
ఎందుకు
లేవమ్మా!

## 42

తప్పకుండానే
మరెవరూ
ఖనిజాలు
ఇవ్వకుండానే
మన కనులు...
కలల గనులు....

## 43

వేషగాడు
వేటగాడైనపుడు
మచ్చుకి
పిచ్చుకైనా
భయపడదు!

## 44

దరిద్ర దేవతా
కనవే!
మొలకి మాత్రమే
గుడ్డలు..
మొండి గోడల్లా
నీ బిడ్డలు...

## 45

నైతిక విలువల్లో
వీడు ఉక్కూకాదు
వాడు కంచూకాదు
ఇద్దరూ
చెదలెక్కిన
చెక్కలే......!

## 46

రాత్రి
భలే కలొచ్చింది
భూమ్మీద
నూకలు చెల్లినవారికి
ప్రభుత్వం తరపున
స్వర్గంలో
సన్న బియ్యమిస్తారుట.....

## 47

బోర్లించిన పడవలా
నెత్తిన టోపీ -
రగుల్తున్న కాష్టంలా
నోట్లో చుట్ట-

మెళ్లో
నినాదాల పేగులు.....
ఈడెవడండీ బాబూ
రాజకీయాల్లో
కోటి నాగులు...?!

## 48

అస్థిపంజరంలో
దాగిన
ఆకలి బాధే
అగ్గిపెట్టెలో
అమిరే
అందాల చీరెగా
రూపాంతరం
చెందినపుడు
మనకు మళ్లీ మళ్లీ
చేనేత కార్మికుల
దురదృష్టపు చావే
గుర్తొస్తుంది!

## 49

సీసాల మీంచి
నడిచే
ఏనుగులూ
కల్లు సీసాల మీంచి
నడిచే
ప్రభుత్వాలూ
జనం ముందు
అద్భుతమైన
సర్కస్ ఫీట్లు
చెయ్యగలవ్!

## 50

గాయాన్ని
తొలుస్తున్న
బాధవెంట
నువ్వూ నేనూ
పయనిస్తున్నా
మనిద్దరం
అపరిచితులం
ఆపరిష్కృతులం!

## 51

ప్లాస్టిక్ దో
ప్రకృతి సిద్ధమైందో
తెలియని పువ్వు లాంటిదే
నగరంలో
ఎదుటి వారి నవ్వు!

## 52

గుర్తుంచుకో
మనమేసే
ఓటే
వాడికి
ఆక్సిజన్
లేదా.... ఆక్సిడెంట్!

## 53

ముప్పై
రూపాయలకి
నేరుస్థుణ్ని
ఉరితీసేది
తలారి –
ముప్పై లక్షలకి

ముప్పై కోట్లకి
దేశానికి
ఉరి బిగించేది
దళారి–

## 54

తవ్వినకొలదీ
కష్టాలూ కన్నీళ్లతో
బయల్పడే
కార్మికుల గని
మన గోదావరిఖని.....!

## 55

క్రిమి సంహారక మందుల్లేవు
మందులున్న ఆసుపత్రుల్లేవు
వైద్యుల్లేరు
బాధ్యుల్లేరు
కుగ్రామాలకు దారుల్లేవు
అందుకనే విస్తరిస్తుంది
మృత్యువుగా మారి
మలేరియా మహమ్మారి!

## 56

అంతస్తు

శిరస్సూ కాదు

గుడిసెలు

పాదాలూ కావు

ఖండ ఖండాలుగా

నరకబడ్డ ఈ దేశం

ఒక దేహమూ కాదు!

## 57

ప్రజల మాట

శిరసావహించని

వాడెవడైనా

తనని తాను

శవంగా

మోయగలడు

సింహాసనంపై

శీర్షాసనం

వేయగలడు!

58

ఏ నయవంచక

రాజకీయ

కాలమానమూ

సూచించదు

ఉద్వేగభరితమైన

నిరుద్యోగ భారతాన్ని

59

ఏ దేశం శిరసు మీద

మోపిన

పాదాలైనా

హోదాలైనా

సామ్రాజ్యవాదాలే !

60

దాహం దాహంగా

డాలర్ నాలుక చాచిన

బహుళజాతి కుక్కా

దేశం దేశమంతా
వాగ్దానాల ఊళ పెడుతున్న
అరాజకీయాల నక్కా
రెండూ
బహు ప్రమాదకరమైనవి !

## 61

దేశంలోని
బడా
రాజకీయ వ్యాపారుల
బండారాలన్నీ...
'స్విస్'
భాండాగారాలేనట?!

## 62

ప్రతి మనిషి
ముఖమూ
పఠనీయ గ్రంథమే
మరి నీ బతుకు
పేజీలు తిరగేసేదెవరో!

## 63

ఊహో సుందరి

భుజాలూ

వక్షోజాలెలాగూ

గుండ్రంగానే ఉంటాయ్

అక్షరాల్నమ్ముకునే

రచయితల ముఖాలే

పలకలు పలకలుగా

పగిలుంటాయ్!

## 64

లిబర్టి స్టాచ్యూ

చూడగానే

న్యూయార్క్

గుర్తొచ్చినట్టు

లీటరు సారా

కనబడితే

ఓటరు మహాశయుడు

గుర్తొస్తాడు!

## 65

గరీబోడి

చేతికందని

తందూరీ రోటీ

నగరాకాశంలో

రాత్రంతా

చందమామ బ్యూటీ

## 66

పరిమిత

కళాప్రియులకే

పారవశ్యదృశ్యమై

ప్రముఖులూ

ప్రతినిధులకే

అద్భుత చిత్రమాలికై

అలరిస్తే

అలంకరిస్తే

'పనోరమా' ఉత్సవమా!

మాకేదీ ఉత్సాహం?

## 67

నువ్వెక్కిన మెట్లెన్ని!
నువ్వు నడిచే దారంట
చెట్లెన్ని?
నీ ప్యాంటుకి ఊడిన
కుట్లెన్ని
ఇదండీ నేటి యింటర్వ్యూలో
ప్రశ్నల వరస...

## 68

ప్రేమనెప్పుడూ
నిరుద్యోగం నిప్పుతో
వెలిగించబోకు...
కావచ్చు
అది హృదయారణ్యమంతా
కార్చిచ్చు...

## 69

అగ్గిపుల్ల పట్టుకొని
సిగరెట్ అర్థించేవాడూ
స్ట్రా కలిగుండీ
కూల్‌డ్రింక్‌కై
కలవరించే వాడూ-
అచ్చమైన ఆశాజీవి!

## 70

బాంబులూ బరిసెలూ
గొడ్డళ్లే
ఎన్నికల కళ్లు
ప్రవహించే నెత్తురే
ప్రజాస్వామ్యపు రంగు
శ్మశాన పత్రంలో
కపాలమే ఓ గుర్తు

## 71

గాలీ
వెలుతురూ
సోకని
లాకర్లో
రోజు రోజుకీ
ఉబ్బిపోయే శవం
నల్లధనం!

## 72

రాజుకునే
జీవనాటవిలో..
ప్రేమకైనా
పోరుకైనా

కళ్లూ కళ్లే
చెకుముకి రాళ్లు!

## 73

కత్తిమీద
పూలమాలలేసి
మనమిప్పుడు
కరుణరసం ఒలుకుదాం!
ఉత్తుత్తి
ప్రగతిపాలు పితికి
మనమిప్పుడు
జనం పైన చిలుకుదాం

## 74

నాలుగు గ్లాసులు కలిసి
ఒక సీసాని
చెరబట్టగా లేనిది
రెండు బూతు పాటలు పెట్టి
ఒక తెలుగు సినిమాని
'తెర' బెట్టలేరా....

## 75

అర్భకుడైన కవి ఒకడు

అవార్డులూ

సన్మానాల కోసం

దేబిరించడం తప్ప

నగరంలో నేడు

అవాంఛనీయ

సంఘటనలేవీ జరుగలేదు!

## 76

క్షౌరకళో
చోరకళో
తెలియకుండానే
మన నెత్తి
బోడి గుండయ్యేదెప్పుడు....?
చడీ చప్పుడూ
లేకుండా
రాజకీయాలు
కత్తెరేసినప్పుడు....!

## 77

పేదోడి
మెడకెప్పుడూ
ధనికుడే
ఉరితాడు
పెట్టుబడిదారుకు
నిజం చెబితే
పళ్లు పటపటా
కొరుకుతాడు

## 78

చెయ్యి
కందిపోతుంది
కందిపప్పు తాకకు....
దవడ
పేలిపోతుంది
ధరలేవీ చెప్పకు...

## 79

ఎవరూ ఎత్తని
మోయని
రూపాయి పాడె మీద

నిరంతరం
ఊరేగుతున్న శవమే
సగటు మనిషి!

## 80

స్టేజీరాకుండా
బస్సు
బాదేవాడు
బప్పీలహరి
టైటిల్స్ పడకుండా
సీటు
'చించే'వాడు
ఇళయరాజా!

## 81

కలిసి
పంచుకుంటే
కథెప్పుడూ
సుఖాంతమే
పడక
పెంచు కొంటేనే
ఒకడు – ఖాకీ
మరొకడు – డాకూ

## 82

సమిష్టి బాధల
సుదీర్ఘ శ్వాసే
ఒక
ఊరేగింపు

## 83

మీసాలకి రంగు
ముసలి తోలుకి సరికొత్త హంగు
ఇంకా
మీ కనుబొమలు
ఇంద్రధనుసులా వంగు
మరింకేం
మా 'బ్యూటీ పార్ల'ర్లోకి తొంగు!

## 84

మిణుకు మిణుకుమని
ప్రకాశించే వాడు
మంత్రి
మిట్టమధ్యాహ్నంలా
మండిపడేవాడు
ముఖ్యమంత్రి!

## 85

గొంతు కోస్తే

పాట ఆగిపోదు

అది...

ముక్త కంఠం

గొలుసులేస్తే

పోరు నిలిచిపోదు

ఇది....

ప్రజాయుద్ధం!!!!

## 86

బస్తాలు

లేపేందుకు

వస్తాదులే

కావాలా?

చాలు

చాలొక

సనసన్నని

రిక్షావాలా!

## 87

స్త్రీ
శరీర సౌందర్యాన్ని
బహిర్గత పరిచేది
ఉల్లిపొరా....?
వెండితెరా....?
చెల్లీ తల్లీ
తెలుసుకో!
తేల్చుకో!!

## 88

ఆర్టీసీ అద్దాలపై
ప్రకటించే
ప్రాథమిక యుద్ధాలన్నీ
ఈ దేశంలోని పగుళ్ళే...
వెలుతురు లేని పగళ్లే...

## 89

కుట్టిన కొద్దీ
చిరిగే లాగు...
మన
తెలుగు సినిమా
డైలాగు....!

## 90

అన్నం మెతుకునీ
ఆగర్భ శ్రీమంతున్నీ
వేరు చేస్తే
అసలు
శ్రమ విలువేదో
తేలిపోదూ....?

## 91

కుక్కగొడుగుని
మహావృక్షంగా
చిత్రీకరించే
కెమెరా
మన తెలుగు సినిమా
కనరా!

## 92

ఈ మధ్య
బల్లితో నల్లి-
కుక్కతో పిల్లి-
ఒకటే గుసగుస...
'భోఫోర్స్' కుంభకోణం
వాటిదాకా
పాకినట్టుంది.....!!

## 93

కల్పనా చాతుర్యం
పెరిగిన
'ఎదురు కాల్పు'ల
కథలకు
పోలీసుల
తుపాకీ గొట్టాలే
కలాలు!
గళాలు!!

## 94

మన గుండెనే
సౌండ్ ప్రూఫ్ గదిగా
మారిపోతే
మరింకెవరి
ఆర్తనాదాలు
వినిపించవు

## 95

"ఎవరీ 'హై' హీల్సు"...
"బంజారాహిల్సు"...

## 96

ఆకాశంలో
చుక్కలంత
విరివిగా
ఇరానీ టీ కప్పులుండగా
మనకెందుకురా
అయిదు నక్షత్రాల హోటల్!
కోటలు దాటే
మాటల్!!

## 97

తాతా
'అర్జునా ఫల్గునా' అని
తల బాదుకోకు
నిర్జన ప్రదేశమేదీ
దొరకదు
మూత్ర విసర్జనకు

## 98

బురదలాంటి
వరదలాంటి
వానా
నువ్వేగా
పేదోడి కన్నీటి ఖజానా!

## 99

సంచిలో

చెయ్యి పెడితే

సబ్సిడి బియ్యంలా

తగిలేదీ వాడే.....

కంచిలో

కాలెడితే

ప్రాయశ్చిత్తం చేసుకుంటున్న

పాపంలా

గొణిగేదీ వాడే...

## 100

పుచ్చుకున్న

రాజీనామా లేఖలే

ఇంకొకరి చేతిలో

విచ్చుకున్న

సరికొత్త పదవీ రేకులైతే

నువ్వు

క్షణికమైన పరిమళమే

రాజకీయమా...!

## 101

మనల్ని
ఇన్‌స్టంటుగా
నవ్వించినా...
ఇన్‌స్టాల్‌మెంటుగా
కవ్వించినా....
ఖచ్చితంగా
సేల్స్ రిప్రజెంటేటివే!

## 102

పాత ప్రభుత్వాల్తో
చితికిపోయిన
ప్రజలు....
కొత్త ప్రభుత్వాల్తో
'చితి'కి
పోకుంటే చాలు...!!

## 103

బారెడు గడ్డం, జానెడు గోరూ
ఏం పెంచినా
స్థాపించే ప్రపంచరికార్డే-

ఎటొచ్చీ గిన్నెలోకి
అన్నంముద్దే కరువై
ఎవ్వడూ ఎక్కలేదు
గిన్నీస్ బుక్కులోకి.......

## 104

మీ వెంట్రుకలు కొరివిదయ్యాల్లా
మెరవాలంటే
మా కంపెనీవారి వినూత్న సృష్టి
డాంబర్నే వాడండి

## 105

మతకల్లోలాలెన్ని చెలరేగినా
మధ్యన చలించక నిలిచే
యోధానయోధుడే
చార్మినార్-

## 106

రాత్రంతా
ఆకాశాన్ని
తనిఖీ చేస్తే
ఒలికిపోయిన
పంచదార గుళికలు
చుక్కలు

పట్టుబడ్డ
బ్లాక్ మార్కెటీరు
చంద్రుడు!

## 107

నిటారుగా
సాగిన
కాండం
రాచబాటైతే
అల్లిబిల్లి
గల్లీలే
దాని కొమ్మలూ
రెమ్మలూ

## 108

గరీ 'బోడి' గుండుమీద
మండే
ఎండ లాంటిది
గవర్నమెంటు!

## 109

ఉవ్వెత్తున ఎగసిన
ఆకలికెరటం
ఏ హోటల్ యజమాని
కాళ్లముందో
మోకర్లితే
సర్వసాధారణంగా
అతనే మనకు
సర్వర్!

## 110

కలలు మాసిన
కళ్ళు.. ఇల్లు....
కన్నీళ్ళద్దిన
బతుకు కుంచె
కానీ,
తాను సృష్టించే ప్రతిదీ
అందాలబొమ్మే...
'నిర్మల్ పట్టుకొమ్మే....

## 111

ఎదురు కాల్పుల్లో
ఎక్కాల పుస్తకం
లభించినా
పోలీసుల పరిభాషలో
అది....
తీవ్రవాద
*గణాంక శాస్త్రమే!?*

## 112

ఏముందీ
ఎగ్జిబిషన్‌లో.....
రేట్లూ ఎక్కువ–
గేట్లూ ఎక్కువ–

## 113

బాల కార్మికుడి
బనీను చిరుగులోంచి
చూడగలిగితే
చిగురించని
ఈ దేశమే
సాక్షాత్కరిస్తుంది

## 114

నువ్వీ
నాగరిక ప్రపంచంలో
స్పృహ
కోల్పోయినంతకాలం
నీ చీర – వెండితెర
నీ పైట – ప్రకటనల క్యాన్వాసు
నీ ప్రేమ – రాసలీల

## 115

యాభయ్యారు
అక్షరాల
తెలుగు ముందు
ఇరవయ్యారు
అక్షరాల
ఇంగ్లీషుదే
ఓహో
చెప్పలేని
వొయ్యారం....!

## 116

“ఆర్యా....
ఏమిటీ రసాయనిక చర్యా....”?
“వెరీ సింపుల్
పరీక్షనాళికలో భారద్దేశం
పొగులుకక్కేది నిరుద్యోగం....”
“అదెట్లా...”?
“ఆ కింద అంటించిన సెగే
అశాస్త్రీయ విద్యావిధానం....”

## 117

పదవుల కిరీటం
పడిపోతే
ప్రవహించదు
రాజకీయాల నెత్తురు
పనిచేయవు
మాజీ
‘మంత్ర’ శక్తులు!

## 118

సాంకేతిక రంగంలో
ముందంజ
వేయగలిగింది
జపాన్
భారతీయుడు
మేయగలిగింది
జర్దా
పాన్!

## 119

ఎంతటి
బాబ్డ్ హెయిరైనా
మళ్లీ కొప్పా
మనసొప్పు

## 120

ప్రసారమౌతున్న వార్తల్లో
అభివృద్ధి పథకాల
గాలెక్కువై
ఉన్న ఫళంగా
మా రేడియోలన్నీ
ఉబ్బిపోతున్నాయ్....
మంత్రులారా!
కొంచం తగ్గండి....

## 121

డబ్బుకి లొంగువాడు
సీసాకి పొంగువాడు
ఎవడైనా....
అల్పజీవే!

## 122

సెక్రటేరియేట్
ఉష్ట్రపక్షి
సమస్యల ఫైళ్ళల్లో
తల దూర్చి
ఉంచటమే గానీ
తల ఎత్తి
జనం కేసి
చూసిందెపుడో...?

## 123

ఇకిలిస్తే
పళ్లు కనిపించనంత
సుతారమైంది
వాడి నవ్వు!

ఇస్త్రీ నలక్కుండా
దేశసేవ చేయగలిగినంత
సులభతరమైంది
వాడి శరీరంలో కొవ్వు!!

## 124

'చింపిరి జుట్టూ
చిరిగిన చెడ్డీ
చీమిడి ముక్కూ
ఎవడ్రా నువ్'...?
'ఈ దేశపు
దరిద్రానికి
వారసున్ని'....!

## 125

సాయంత్రం సుల్తాన్ బజారే
స్త్రీల సెలయేరు
ఆ మెరిసే రంగురంగుల గులకరాళ్లే
కలవారు

## 126

చెక్కు చెదరని
చెక్కు బుక్కులా
నువ్వు–

నలిగిపోయిన
రేషన్‌కార్డులా
నేను

## 127

రాజకీయాల్లో
ఆమె
ఎటువేపుకి మొగ్గినా
అందాల మొగ్గేనట!

## 128

అగరొత్తినించి
వెలువడేది
పొగకాదు
అది
పరిమళాల
పొగరు!

## 129

రాత్రంతా
కళ్లు మూసుకు
పడుకున్న
ఖాళీ బీరుసీసా

తెల్లారితే

రూపాయిన్నరై

వొళ్లు

విరుచుకోదా

## 130

చిత్రమే...!
ఒంటి మీది
గుడ్డలన్నీ ఒలిచేసి
'అపుడపుడూ
ఆకాశమూ
స్ట్రీకింగ్ చేస్తుంది.

## 131

పది పేను పైసల్తో
ప్రేమని
ఏ సుదూర తీరాలకి
పంపగలిగినా
ఖచ్చితంగా అది
పోస్టు కార్డే...
అసమర్థ ప్రభుత్వాల
అరిగిపోయిన 'రికార్డే'....?

## 132

నగర ముఖమ్మీద
పెట్రోలు
ఆరిపోయినప్పుడల్లా
కారుతున్న
చెమటలే కార్లు....
బడాసార్లు...

## 133

నయాపైస
ఖర్చు లేకుండా
మన నాలుకపై
చక్కెర ఫ్యాక్టరీ
నిర్మించగలవాడే
మంత్రి....!?

## 134

ఓ వర్తమాన
రాజకీయ
వంచకీ....
నీ ధరల
అధరాలు
తాకితే చాలు

వెంటనే
నీ రంగు
వెలిసిపోతుంది....

## 135

ప్రభుత్వాసుపత్రీ
పనికిరాదు
ప్రై'వేటూ'
భరించరాదు
మరి రోగం
కుదిరేదెట్లా....!

## 136

నిర్భంధం పిడికిట్లో
నువ్ బంధించిన
గాలేది
నియంతృత్వపు చేతుల్తో
నువ్ విరిచిన
కలమేదీ
అదిగదిగో
నిన్నధిగమించి
మళ్లిందా గాలే...
మళ్లీ ఆ కలమే...

## 137

నా కనురెప్పల
తలుపులు
బార్లా తెరచిచూడు
నా కంట్లో
మండుతోంది
కారం కాదు
శత్రువు ఆకారం

## 138

అందంగా
తోకాడించే
కుక్కపిల్ల లాటిది
కాదు
కుట్టిన
ఎర్రతేలు
మంటలాంటిది
ఆకలి

## 139

సాయంకాలాలైతే చాలు
జనం పై పైకి
పాకే
కల్లు పాకలూ...

బొంది లోని ప్రాణాల్ని
తోడే
బ్రాంది షాపులూ....

140

భావికి
మెట్లు–
బోగస్
సర్టిఫికెట్లు–

141

సౌందర్యాభరణాలన్నీ
వొలిచేసి
ఇవాళ
నగ్నంగా నిలబడదాం
అబద్ధాల సరిహద్దులన్నీ
చెరిపేసి
ఇవాళ
అద్దంలా కనబడదాం

142

నిరుద్యోగ దుర్గంధం
సోకనంత పరిమళం
కాలుష్యం కాలూనని
నగరమంత నందనం

హైదరాబాదు
విశ్వవిద్యాలయమా!
నీకిదే... అభినందనం

## 143

కుట్రనే
చట్రంలో
దేశాన్ని
బిగించగలవాడే
అరాజకీయ సంపన్నుడు!

## 144

తల్లి ఒడివంటి
పల్లె సీమల్నొదిలి
తరలి వచ్చిన
పేద రైతులూ
యినప్పెట్టెల్లాంటి
ఈ పట్టణాల్లో
ఊపిరాడని
మీ బతుకులూ

## 145

సారీ!

ఈ నియోజక వర్గంలో
మిమ్మల్ని కలవడం
మొట్టమొదటి సారి

కాని
మిమ్మల్ని గాఢంగా
ప్రేమించడం
ఇది మూడోసారి!

## 146

కుక్కలూ లేని
కుక్కరూ లేని
ఇల్లే – ఒకింత
ప్రశాంతి

## 147

ప్రకృతిలో
ముళ్ళు
పొద సూపినప్పటినుంచే
నేను
పువ్వుల్ని ప్రేమించడం
ప్రారంభించాను!

ఖండాంతరాల నడుమ
మానవత్వం
ఖననం గావింపబడుతున్నప్పుడే
నేను
రాక్షసుడిగా ఎదగటం
నేర్చుకున్నాను!!

## 148

విద్యార్థుల ఎగుమతి
నిరుద్యోగుల దిగుమతి
చేయగల
చదువుల రేవులు
యూనివర్శిటీలు

## 149

పెట్టుబడి
ఎవడి చేతికి
పట్టుబడి
కరెన్సీ పుష్పాలు
విరబూస్తుందో
వాడే
కష్టజీవికి – యజమాని

## 150

చూస్తుండగానే
బోడిగుండు మీద
వెంట్రుకలు మొలిచి
ఉంగరాలు తిరగటమెంత
అబద్ధమో
ఎన్నికల్లో వాగ్దానాలంత
అబద్ధం!

## 151

ఈ దేశంలో
పక్కవాడి
పేపరడుక్కుని
చదివే ప్రతి ఒక్కడూ
పరాన్న 'బుక్కు'డే

## 152

రిక్షావాడు
కనబడితే చాలు
రూపాయి బిళ్లంత
సంస్కృతి
పావలాకి
కుచించుకుపోతుంది.

## 153

ఊపిరి
పీల్చేముందే
ఒకసారీగాలిని
తనిఖీ చెయ్....!
లేదా
ఈ గాల్లో
ఎన్ని రాజకీయాలో...
అరాచకీయాలో

## 154

"వెడ్డింగ్
ఇన్విటేషన్ " కి
బదులుబుబు
"వెల్డింగ్
ఇన్విటేషన్ " అని
కొడితే
మా పెళ్ళికెవడొస్తాడు
మహాప్రభో...!

## 155

గుక్కెడు
గంజి నీళ్లూ లేవు
గుడ్డ పేలికా లేదు
ఓరి దరిద్రుడా!
ఒక అసమర్థ ప్రభుత్వ
నినాదం...
"ఉరేసుకు చావు"

## 156

ఏ గ్రూపు రక్తమైనా
పీల్చగలవి
దోమలు...
దోపిడీదారులు...

## 157

పార్లమెంటూ క్షేమమే
అసెంబ్లీ క్షేమమే
చీకటి బజారులో చిందులేసే
పందికొక్కులూ క్షేమమే

రాజకీయాల తోలుబొమ్మలూ
క్షేమమే
తోలు వొలుచుకు తినే
మారాజులు క్షేమమే
ఒక్క బక్కరైతు బతుకులోంచి
పొడుచుకొచ్చిన
వెన్నెముక తప్ప.....
అంతా క్షేమమే!

## 158

సాహస మహాసౌధం ముందు
భయమొక
యిసుక రేణువు
సమీకృత శక్తులకీ
శతృవే
పరమాణువు

## 159

ఆధునిక మానవుడు
అన్యమనస్కంగా
పీల్చే నశ్యం
కాలుష్యం

## 160

అత్యాధునికంగా
ఎదిగిన నగరం
సుతారంగా
ఫ్యాక్టరీ ఫోర్క్‌తో
శ్రమని గుచ్చి
అదే పనిగ.... అది
లాభాల నోటికందిస్తే
కార్మికుడా
నువ్వొక
వేగిన మాంసం ముక్కవి

## 161

ఆమె
నడుస్తున్న
బ్యూటీ 'రోకో'...
ఇతడు
గుడ్లు నిలేసిన
గుడ్ల గూబో......
రోజూ
నగరం రోడ్లమీద
బహువింత బాబో!

## 162

దరిద్ర భరతావని
పరీక్షా పత్రంలో
'ఖాళీలు పూరింపుము'
అంటే
స్ఫురించేవి
పూరిళ్లే.....!

## 163

ఉండబట్టలేక
ఓటేస్తే
ఉన్నబట్టా
లాక్కున్నట్టు...

## 164

కడుపులో
ఉండచుట్టుకు
పడుకున్న
ఆకలి పేగుల్లేచి
అదేపనిగ
ఆవేశం అంకెల్ని
డయల్ చేస్తే

ఎప్పుడో సారి
రివల్యూషన్
'రింగ'వదా....!!

## 165

ఎందుకురా కవీ
గజిబిజి ఇమేజీ
అస్పష్ట కవిత్వం కన్నా
ఆల్జీబ్రా ఈజీ

## 166

బూటుకాల్నించీ
టోపీ వరకున్న అధికారం
'టోకు' నించి 'చిల్లర' కూ
దిగజారితే అనర్థం-

## 167

నినాదాల
మోదుగులు
పూసే
ఈ దేశం గోడల్నీ
నిరంతరం వీచే

నిరుద్యోగాల
వడగాలుల్నీ
ఎవరు
ఏ విధంగా
చిదిమెయ్యగలరు...?
చల్లార్చగలరు....??

## 168

మా విశ్వాసాల్ని
మీ బూటకపు ఎన్నికల
పన్నాగాలతో
కొల్లగొట్టటం..... రాజద్రోహ నేరం
మా గుండెల్లోకి
'టాటా'ల్ని
పెట్టుబడి తూటాల్ని
దింపటం, చంపటం....

రాజద్రోహ నేరం
మా ఒకే రక్తాన్ని
భిన్న మతాలుగా
వర్గీకరించటం
మీ..... రాజద్రోహ నేరం

## 169

జన జీవన కెరటాల్లో
ఊగుతోంది
మృత్యునౌక
మతమౌఢ్యం మందిరాన
మోగుతోంది
చావుకేక
ఏదీ
మనకందని దూరం
మానవతా తీరం

## 170

సూర్యుని
వెలుతురు కిరణాల
దస్తూరితోనే
చీకటి ఖైదీ
విడుదల సాధ్యం

## 171

పేద దేశాలని
తారుపోసి
చదునుచేసే
రోలర్....
డాలర్!

## 172

బార్లెందుకంటే
తాగి
సీసాల్లా దొర్లటానికి
డాన్సరుంటే
మునివేళ్ళతో తాకి
కామం మండిస్తుందని
కల్చురెక్కువైతే
కడుపులోనిదంతా
కక్కెయ్యొచ్చని

## 173

విరివిగా
నాయకుల
నాలుకలపై
నాచు
పేరుకుంటుంది
గనుక....
తరుచూ
మాటలు
జారుతుంటాయ్!

## 174

వరుసగా
అయిదు
తెలుగు సినిమాలు
చూస్తే
చస్తే
పంచేంద్రియాలు
పన్జేయవు!?

## 175

"మీటరు బద్దంత పొడవైన
మీ కలంలో
ఎన్ని లీటర్ల సిరా పోస్తారో
సెలవిస్తారా"...
"హు!
సీరియల్ రచయితలుగా
పుట్టిన మేం
మా జీవితాన్నే ధారపోస్తాం".......

## 176

లాటరీల చీకట్లో
లక్షలాది బ్రతుకులు
అదృష్టం సూర్యరశ్మి
ఎన్నటికీ సోకదు.

## 177

గిరి గీసిన
ప్రేమలూ..... విప్లవాల్నీ
వెచ్చని
వెండితెర గుహలుగా
మలిచిన చోటే
వ్యాపారం
కేంద్రీకృతమౌతుంది
వ్యామోహం
వెర్రితలలేస్తుంది

## 178

నగరంలో
అటు భవంతులూ
యిటు పూరిళ్ళూ
దారిద్ర్యం
సౌభాగ్యం
సమాంతరరేఖలు

## 179

చేదు నిజం
చెప్పాలంటే
నేటి చదువే
రేపటి చెదలు

## 180

గుండెల్లో
మెత్తగా దిగబడే
కాగితపు కత్తి
కరెన్సీ నోటు

## 181

థియేటర్ ముందు
కృత్రిమంగా
మొలిచిన
'క్యూ' అనే చెయ్యి....
అశ్లీలాన్ని
అడుక్కు
తింటున్నట్టుంది

## 182

ఆరని
ఎనామిల్ పేయింటుకి
ఎగిరొచ్చిన
సీతాకోకచిలుక
ఎంచక్కా అతుక్కుంది
ఎంతైనా
గొప్పింటి గోడలవి

## 183

ప్రజాస్వామ్య
'ఖూని' రాగానికి
పల్లవి, చరణాలూ
ప్రజలే

## 184

జోర్డాన్ సరిహద్దుల్లో
చిక్కడిన
వేలాది శరణార్థులు
ఆకలికి తాళలేక
ఎవరికి దొరికింది వారు
విరుచుకు తిందామని

ఎగబడినప్పుడు
నాకీ
భూమి భూమంతా
బూజెక్కిన రొట్టెలాగే
కనిపించింది!

## 185

రోజుకి రెండుసార్లు
ప్రసవించే
పోస్ట్ బాక్స్ తల్లికి
కోకొల్లలు
ఉత్తరాల పిల్లలు

## 186

ఇక్కడ
డిగ్రీ
ఉద్యోగ పుష్పంగా
వికసించి
పరిమళించదు
కాగితప్పడవై
కొట్టుకు పోతుంది

## 187

ప్రతి క్షణం
రోడ్డు
చైతన్యానికి ప్రతీకైతే-
దానిపై  పరిగెత్తే
మనిషే
ఒక జడపదార్ధం

## 188

ఇరవై తొమ్మిది రోజుల
విరహాన్ని
భరిస్తే
ఒకే ఒక్క రోజు
'జీతం' జవరాలితో
జలసాలు-

## 189

పరధ్యానంగా ఉండి
పర్సు
పోగొట్టుకున్నవాళ్ళు
అదృష్టవంతులు

ఒంటిమీది దుస్తుల్లో
ఒక్క
నూలుపోగైనా
పోనందుకు

## 190

అంతటా
హృదయ శైథిల్యం...
అవయవాలు తెగిన
మానవారణ్యం...
నెత్తుట్లో తడిసిన
అంకెలు...
నేలకొరిగిన
నెలవంకలు
కొత్తసంవత్సరం చేతుల్లో
వాడిన బుల్లెట్ల పూలు...!?

## 191

సందుగొందులకే
రాత్రంతా చీకటితో–రణం
రాజ మార్గాలకైతే
వెలుతురు తోరణం

## 192

మన

మొల చుట్టూ

ఓట్లు

కట్టుకుంటే

మనమే

ఆదివాసులం!?

## 193

శృంగారమే అంగారమై

గోడలపై రగిలితే....

ప్రతి సినిమా పోస్టర్

ఒక సెక్స్ మాన్‌స్టర్

## 194

గుడిసె చుట్టూ

భవంతులు

మూగి......

అస్థిపంజరం చుట్టూ

అభివృద్ధి పథకాలు

చేరి....

తెగ బాధ పడినట్టు
పోజులు!
తెల్సుకోరా యివి
ఎన్నికల రోజులు!?

## 195

"లచ్చిగాడు
లచ్చలూ
కోటిగాడు
కోట్లూ
సంపాయించిన
ఆ యాపారం
పేరేంట్రా...?"
"తార్పుడు...!"

## 196

బార్లోపలికి
హుందాగా
అడుగు పెట్టిన
కాలే....

డోర్లోంచి
వెలుపలికొచ్చేటప్పుడు
వణికే తొణికే
ఆల్కహాలు...

## 197

గుత్తులు
గుత్తులుగా
కాసిన ఏ సొత్తు
ఎవరి చేతిలో
బొడ్లో
తాళాల గుత్తులో

## 198

నిన్న, నేడు
పారిశ్రామిక వాడల్లోకి
పాకుతున్న
కరెన్సీ పాములు
మొన్న
బడా భూస్వాములు!

## 199

నోరెండి నువ్వూ
నీరెండి చేపా
దాహంతో
కొనఊపిరితో
కొట్టుకుంటున్నపుడు
నాకు
'కోకాకోలా' సామ్రాజ్యవాదమే
గుర్తొస్తుంది!

## 200

తమ్ముడూ తమ్ముడూ
నువ్వొచ్చేటప్పుడు తప్పక
పిడికెడు
కల్లోలిత ప్రాంతాల మట్టినైనా
తీసుకురా....
పోరుదారిలో
నేలకొరిగిన
ఒక అమరవీరుని జ్ఞాపకమైనా
మోసుకురా.....

మళ్ళీ మళ్ళీ నాకు
జగిత్యాల గుర్తొస్తుంది
జైత్రయాత్ర నను
కలవరపెడుతోంది.....

## 201

పువ్వులు కోసి
అందంగా
గాజుకుండీల్లో
అమర్చినట్టు
గొంతులు కోసి
అద్భుతంగా
రాజకీయాల్లో
అలంకరిస్తారు
మొదటిది కనిపిస్తే
రెండోవి కనిపించవు!?

## 202

చెమటదీపం
ఆరిపోతే
చరిత్రంతా
చీకటే...

ఆకలి సెగలు
అడివంటుకుంటే
తీవ్రవాదం
జనజాతరే....

## 203

పల్లెత్తు మాటనని
పల్లెల పెదవులు
చిట్లి
రక్తం స్రవించినప్పుడు
నాకు
ఖాకీలు ఝులిపించే
కల్లోలిత ప్రాంతాల
కొరడాలే గుర్తొస్తాయి

## 204

'బారాత్'లో
గుర్రమ్మీద వెలిగె
పెళ్లి కొడుకుల్నేకాదు
పెట్రోమాక్స్ లైట్ల కింద
నలిగే
పేద తల్లుల్నీ చూడు

## 205

తెలతెల్లని
గౌనుల్లోకి
అందంగా ఉబికి
ఆసుపత్రి గదులన్నిటా
ఆత్మీయంగా
వొలికి
మా గుండెల్లో గుబాలించే
మీరంతా ఎవరే
నర్సులా...!
పూల పర్సులా...!!

## 206

వెండి తెర
ఒక్కసారే
నటిస్తుంది
రంగస్థలం
రోజూ
రంగు పులుముకోవాలి
సినిమా
ఒకేసారి
సిగ్గుపడుతుంది

నాటకం

ఎల్లవేళలా

శీలం కాపాడుకోవాలి!

## 207

గాడితప్పి

గాడిదలు

రాకెన్ రోళ్ళు

చెయ్యగలవేమోగాని

తప్పతాగి

తప్పటడుగులువేసే

ఉన్మాదులకి

నాట్యమెప్పుడూ రాదు

రోడ్లమీద సీసాలై దొర్లే

రౌడీలకు

జీవనగమనంలో

సరిగమలెప్పుడూరావు

## 208

సిటీలో

బతుకంతా

ఎమోషన్

చెప్పు తెగితే
చేతికి
ప్రమోషన్

## 209

నువ్వెంత
కలిగుంటేనేం
దర్జా–
నిన్ను
అదరగొట్టేవాడు
దర్జీ

## 210

గోడ–
గోడమీద పిల్లి–
పిల్లి నెత్తిన టోపీ–
ఫోటో తీస్తే
దొంగముండ
ఎంత ముద్దొస్తుందో....!?

## 211

అటవీ శాఖలో
కొందరికి
ఉద్యోగమే
కల్ప వృక్షం-
కాకుంటే
'కలప' వృక్షం

## 212

చిరిగిన
జాకెట్టూ పరికిణీలోంచి
తొణికిస లాడుతున్న
తొలి యవ్వనమంతా
దరిద్రం
తొలిచి తొలిచి
చూపిస్తుంటే....
నగరమా
నీ కెన్నేసి 'దొంగ' కళ్లు?
యింకెన్నేసి
'చొంగ'నోళ్లు??

## 213

చెల్లీ
పెళ్లికొడుకు
రేటు (ట)
ఒక 'ల' కారం
మరి దగ్గరగా
పరికించి చూడు
ఆ అగంతకుని
ఆకారం!

## 214

తెలుగు సినిమాలు
చూసిన తలకాయల్ని
రిపేరు
చెయ్యగలిగితే
ఒట్టు
ఈ రోజుల్లో అదే
బ్రహ్మాండమైన కొట్టు

## 215

ఆరుకోట్లాంధ్రుల
జ్ఞానోదయానికి
అరవై మూడడుగుల
బుద్ధవిగ్రహమే
కావాలా....?

అన్నా
నీ మీదొట్టు
నువ్వే పెద్ద బోధిచెట్టు!

## 216

పేదవాడి కందనివి
చెందనివి
మచ్చుకు రెండు-
జూబ్లీహిల్స్ రాయి....
కృష్ణా ఒబేరాయి....

## 217

విరక్తి భావాల్నుంచి
విధ్వంసక చర్యల్నుంచి
ముసలి విశ్వవిద్యాలయ
భవన సముదాయాల్నుంచి
నిరుద్యోగమా
నీ దారెటు...,?!

## 218

రైటర్సు
మాన్స్క్రిప్టూ
డాక్టర్సు
ప్రిస్క్రిప్షనూ... కలిపి
సృష్టించగలమేమో
మరో కొత్త -లిపి

## 219

డబ్బు
సంచులవంటి
గ్రామ
సర్పంచులుండగా
నీరుగారిపోదా
నీ
రోజుగారు పథకం!

## 220

సందు
దొరికిందంటే
కవులు......
దూరి
పోతారండి
మన చెవులు.....

## 221

అందమైన అమ్మాయిల్ని
ప్రేమించే వాళ్లు
రోజంతా
ఏం చేస్తారు

మందమైన తోలుమీద
రంగు రంగుల
అంగీలేసుకు
ఊరేగుతారు!

## 222

బంగళా
బంగళా
రాసుకుంటే
కల్తీ సిమెంటు
రాలినట్టు...

## 223

శాఖోపశాఖలుగా
విస్తరిస్తున్న చెట్టే
భారతంలో – క్రికెట్టు

## 224

కుంభకోణం టోపీ
కొత్త బట్టతలపై
వాలినట్టు
అవినీతి పొట్టని
నల్లధనం బొడ్డు
మార్చినట్టు

ఛూ!

రాజకీయమంత

నీతి బాహ్యమైంది

మరొకటి లేదు

## 225

కరువు

ఏ ధాన్యపు గింజలోకి దూరి

ఏకరువు పెట్టకుంటేనేం...?

ఆకలి చావులు దండెత్తి

ఏ అస్థిపంజరాల్ని

కూలదోస్తే నేం...?

అవకాశవాద రాజకీయాలకి

అదంతా ఒక 'మిథ్య'

## 226

వారిరువురూ

కలిసి

ఒకే ప్రేమ గాయం...

విభజించినా

ఒకే

భౌతికకాయం...

## 227

మానభంగాల
కనుబొమల నడుమ
చెల్లీ
చెదిరిన నీ తిలకం
కావాలి
విరిగిన సూర్యఫలకం!

## 228

బతుకుదారులూ
దారాలు
తెగిపోయినవి
ముగ్గులూ
మగ్గాలు
మూగవోయినవి
ఇల్లిల్లు దాటి
సిరిసిల్ల దాటి
తొరగా వెళ్లిపోవే
తల్లీ దసరా...!

## 229

సరుకుల్లేని ఖాళీ సంచిలా
నేనొస్తాను
కాలుతున్న బాణాసంచాలా
నువ్వొస్తావు
ముల్లుకెరవుతున్న చేపలా
నేనొస్తాను
మెరిసే ఇంద్రచాపంలా
నువ్వొస్తావు
ఇద్దరం కలిస్తే
నేనొక ఏడ్వలేక ఏడ్చే నవ్వుని!
నువ్వొక నలగని రాజకీయాల పువ్వువి!!

## 230

కడుపనే
గోతిలో
ఆకల్ని
పూడ్చలేం
కన్నీటి త్రాసుతో
దరిద్రాన్ని
కొలవలేం

## 231

కప్పుపైన
కావుకావని
అరిచేది
కాకి....
లాకప్పులోన
చావు చావని
పొడిచేది
'ఖాకీ'...

## 232

మనం
మిట్ట మధ్యాహ్నం
కోర్టు ఆవరణలోకి
అడుగిడితే
మన కళ్ల ముందు
మెరిసేవన్నీ
నల నల్లని
అబద్దాలే!

## 233

బిగుసుకోనున్న ఉరికీ
బిగబట్టిన జనం ఊపిరికీ
మధ్య
సంశయాల చేతుల్తో చట్టం....
సత్వంత్ కేహార్ల చివరి ఘట్టం...

## 234

ఒరలో కత్తీ
గుండెల్లో కుట్ర
రెండూ
పొంచున్న శత్రువులే

## 235

గరీబోడి
గుండెల్ని
చీల్చుకొచ్చిన
తూటా తూటా
నీకంటిన
రాజకీయాల రక్తమేదో
చెప్పవే
మనలో మాటా మాటా...

## 236

ఉదాసీనంగా

ఉండే కన్నీళ్లే

ఉప్పొంగే

నదులైనప్పుడు

దండాలు పెట్టే

బాంచెన్ బతుకులు

దండకారణ్యాలై

రగులుకోవా...!

## 237

కుక్కలూ జాగ్రత్త!

యిక్కడ

విశ్వాస ఘాతకులుంటారు

చుక్కలూ జాగ్రత్త!

యిక్కడ

చోరాగ్రేసరులుంటారు

## 238

నగరమా

నఖశిఖ పర్యంతం

నీలో......

అంతస్తులే
వైరుధ్యాలే
వ్యత్యాసాలే–
అవన్నీ
సమసిపోయినప్పుడే
నిజం–సోషలిజం.

## 239

ఈ
నికృష్ట సమాజంలో
నిగనిగలాడే బాకూ
నిత్యావసర వస్తువే –

## 240

భగ్గున
ఎండలింకా
మండుతాయ్
షాలిబండా
కాచుకో
బోడిగుండూ
దాచుకో

## 241

‘చిల్లర’ తల్లి చిరునామా

చేజిక్కేవరకూ

భాగ్యనగరంలో రూపాయి

తప్పిపోయిన పాపాయి

## 242

ఎవరెవరి

ఆశలూ ఆకాంక్షలూ

హరించి

వెలిగించిరో యిచట

విద్యుద్దీపాలు!

ఎవరెవరి

ఎముకలూ కండరాలూ

రంగరించి

నిర్మించిరో యిచట

అంతస్తుల పాపాలు!!

## 243

రేపటి

పూరింటికి

నేడే

ముడిసరుకు –

పారేసిన

పాతరేకు –

## 244

పచ్చనోటు
ఊపితేనే గాని
కదలని రైలు.....
అన్నో
ఆఫీసుల్లో
మన బతుకు ఫైలు....

## 245

పొందని
శీతల పానీయంలా
పోయిన
ఎండాకాలం....
అందని
రెయిను కోటులా
మన ముందర
వానాకాలం.....

## 246

అన్నీ
ప్లాస్టిక్ సర్జరీ
చేసుకున్న ముఖాలే
యిక్కడ
ఎవడుదొంగో
దొరబాబో!

## 247

ఈ దేశంలో
చదువులకంటే
'కాపీ' గొప్పది
మన ఓట్లుకొంటే
'టోపీ' గొప్పది

## 248

ప్రతి పోలీస్ స్టేషన్
ప్రభుత్వ సారాయి దుకాణంగా
కనిపించి
కొనిపించటమే
ఇప్పుడు
లేటెస్ట్ ఫ్యాషన్...!

## 249

"ఒక్కొక్కమొక్కటి
ఒక్క రెండ్రెండు
ఒక్క మూడు మూడు
ఒక్క నాల్నాలుగు..."
కల్లాకపటం ఎరుగని
ఈ ఎక్కాలు
రేపు

నిరుద్యోగ భారతాన్ని
తొడుక్కునే
చొక్కాలు... కావుకదా!

## 250

రాళ్లల్లో బియ్యం
నీళ్లల్లో పాలూ
కలపడం
లాభాపేక్ష కాదు
కళాదృష్టి

## 251

ఊరూరా
స్వయం సంరక్షక దళాల
పొలాలు
దున్ని
అన్నా!
నువ్ పండించిన
ధైర్య సాహసాల
ధాన్యపు గింజలెన్ని?

## 252

నిరాశా నిస్పృహల
మధ్య
ఒక నిరుద్యోగిని
ఫ్రేమ్ కట్టినా
అతని
భవిష్యత్తుకి
అందమైన
సమాధి కట్టినా
ఆ నేరం.... ప్రభుత్వానిదే!

## 253

బలిసిన
పెట్టుబడి కోరలు మొలిసిన
నగర రాక్షసి
కంటికి...
కనిపించని చీమలు
కష్టించే పల్లె సీమలు!

## 254

ఇప్పుడిప్పుడే
సోవియట్ వనితల
అందాలు

విరజిమ్ముతోంది
'గ్లాసు నోస్తు"!
గోర్బచెవా
శుభమస్తు!!

## 255

రాజకీయాల
పూల రథంలో
సాగే
మీ అరెస్టులు
కాజాలవు
ఎన్నటికీ
'ఎవరెస్టు'లు

## 256

కదలకుంటే
శిలారథం
కదిలితే చైతన్యరథం
ఇదేలే మన
ఎన్నికల 'రిథమ్'

## 257

ఎన్నికల బరిలో
దిగాలో...
'నక్సల్ బరి'లో
దూకాలో...
క్షణం క్షణం రణం!
సందిగ్ధావస్థలో జనం!!

## 258

తపాలా ధరలిలా
పెరిగితే
మనకిక
యోగక్షేమాలూ
కరువే
నాలుగు
ప్రేమ వాక్యాలూ
బరువే

## 259

పాలిచ్చే తల్లే
పీకనులుమబోతే
పాపకి దిక్కెవరు
పాలించే ప్రభువే
పీడిస్తూ పోతే
ప్రజలకి దిక్కెదురు

## 260

ఒకరి నౌకరు
పెనవేసుకు
సాగే కాలం గొలుసు
ఉద్యమమైతే
వీరుడి మరణమెప్పుడూ
అంతిమ శ్వాసకాదు.

## 261

అయిదేళ్ల కోసారి
అసెంబ్లీలో మొసళ్ళూ
పార్లమెంటులోకి తిమింగలాలూ
ప్రవేశించటం పెద్ద విశేషం కాదు
జనమే
ఓట్ల జలాశయాలై
వాటిని బతికించటం
విషాదం...?

## 262

కోర్టు బోన్లో నించుని
భోరున విలపిస్తోందో ముద్దాయి
చీమ–

రేషన్ షాప్‌లోని
పంచదారంతా కాజేసిందని
ప్రాసిక్యూషన్ వారి ఆరోపణ-

263

స్త్రీ మాంసం
ముక్కలు ముక్కలుగా
కోసి
విపణి వీధుల్లో
రాసులుగా పోసినా...
అందాల
రాశులుగా పేర్చినా...
అది
దయనీయ దృశ్యమే!

264

దీనాతిదీనంగా
బతుకు చౌరస్తాలో
తారసిల్లే
వీళ్ళే
ఆకలి మెళ్ళో
గిల్టీనగలు
సుఖవ్యాధులు ముడిచిన
సుందర సిగలు!

## 265

ప్రియమైన విద్యార్థీ
సంవత్సరాల తరబడి
నువ్
చదువుతూనే ఉండు
విశ్వవిద్యాలయాల
వీపు మీద
నిరుద్యోగమే
రాచపుండు

## 266

ఒకడి కింద ఒకడి
ఆదేశానుసారం
నలిగిపోయేదే
ఖాకీ యూనిఫారం!

## 267

ఎలుగెత్తి పాడు
ఎవరెస్టు
వినదా!
ఎరుపెక్కి చూడు
సూర్యుడే
దిగడా!!

## 268

నింగినంటే
సౌధంలా
వాడు
నినాదాల
పాదాల కింద
వీడు

## 269

బతుకు ఉపరితలమ్మీద
నిరాశాజనకంగా
చేతులు మొలిచి
అడుక్కోవటం
అబద్ధం కాదు
గరిబోడి గిన్నెకతుక్కున్న
అన్నం మెతుకుల్ని
నాకేసే రాజకీయాలూ
అబద్ధం కాదు

## 270

ప్రజాస్వామ్యం
పాడెమీంచి
కోకొల్లలుగా శవాలనెన్ని
దింపేసినా

మళ్ళీ
పార్లమెంటుకేసి
పరిగెత్తటమే చిత్రం
అధి వాస్తవికతా చిత్రం....

## 271

అదే రసజ్ఞులుప్పొంగే
కళా పరిణతి
ఎవరి హృదయ ప్రకంపనలు
కొలిచే భారమితి
అట్టడుగు ప్రజలకందని
రవీంద్రభారతి

## 272

రోజు రోజుకీ
నాయకుల ముఖాల్లో
పెరిగే
నటనా కౌశలాన్ని
విభిన్న కోణాల్లో
బంధించే
కెమెరాలు
పసికట్టలేవా
వారి
మాయామర్మాలు...!
మేకవన్నె చర్మాలు...!!

## 273

బల్ల కింద చేయి
కాళ్ల కింద గోయి
లంచగొండేనోయి!

## 274

"ఓరి నీ బట్టతల
బంగారు గానూ
అవినీతి బురదలో
కూరుకుపోయింది
నువ్వా..."..?
"అబ్బెబ్బే?
నేను కాదు
అయిదుంగరాల
నాచెయ్యి"....!!

## 275

వడ్డీ వ్యాపారస్తుడు
కట్టుకొన్న
మూడంతస్తుల మేడే
వడ్డీ
బారువడ్డీ
చక్రవడ్డీ

## 276

కూరగాయల మార్కెటంతా
మాయ...
పావలాకో
పచ్చిమిరపకాయ...

## 277

రోజు రోజుకి
విలువ తగ్గే
రూపాయిల ముందు
మా బతుకులెట్టాగని...
వలవలా
ఏడ్చింది
పావలా!
లబ లబా
మొత్తుకుంది
అర్ధణా!!

## 278

ముట్టుకుంటే
వాడిపొయ్యే పూరేకులు
క్యాలెండర్లో
తారీకులు!

## 279

అనాగరికతా
ముఖమ్మీద
చితికిన
రెండు పుళ్లే....
బ్లూ ఫిల్మ్
బ్రౌన్ షుగర్

## 280

కడుపులో పేగుల్ని
కడు బాధాకరంగా
దున్నే నాగలి
ఆకలి!

## 281

తోలుతున్న
రిక్షావాడికి
ముసలి తోలు తప్ప
కండ లేదు....
రిక్షాలో
బియ్యబ్బస్తాలా
బిగుసుక్కూచున్నవాడికి
గుండే లేదు.

## 282

చేయిచాచి అడగకు
ఇక్కడెవరూ
ప్రాణభిక్ష పెట్టరు.
చేతులెత్తి మొక్కకు
ఇక్కడెవరూ
అరాచకాలనరికట్టరు.
ఇక్కడ
మనిషికి మనిషే భయం
ఇది... మారణహోమాలయం!

## 283

గుండె గుండెంతా
గాయల
కూడలైనప్పుడు
జీవితం
పోరాటాల కేంద్రమే...
ఉప్పొంగే
ఉద్యమాల సంద్రమే...

## 284

వేశ్యా గృహాల మరల్లో
'వెండితెర'ల విష కోరల్లో
వెలిసిన విఫణి వీధుల్లో

వెలివేసిన హృదయారణ్యాల్లో
ఎవరే మీరు?
అబలలా...
అందాల రాశులా...
చిలుకలా...
సీతాకోక చిలుకలా...

## 285

కోలుకోని
కోస్తాంధ్రా గుండెల్ని
ఇంకెన్నిసార్లు కోస్తావే
ఉప్పెనా
రాత్రికి రాత్రి
బతుకు వృక్షాల్ని
కూకటివేళ్ళతో పెళ్ళగించి
రాలుతున్న శవాలెన్ని
ఏరుకుతింటావే
ఉప్పెనా...
నువ్ ప్రతిఏటా
మా పాలిటీ
కన్నీటి సంద్రమౌతావని
చెప్పనా.... ఉప్పెనా!

## 286

అన్ని పక్కలా
సారించాలి
మన చూపులు...
మహానగరాల
రోడ్లకి
మరణం
నాలుగు వైపులు...

## 287

అంతస్తులు
ముస్తాబయ్యే వేళ
దట్టంగా పట్టించేది
సిమెంటే

## 288

నిజాం కాలేజీ
మెట్లమీద
చదువుల్ని
ఐస్‌క్రీంలా చప్పరించే
బాబులూ
నిజంగా మీరేలేరా
నవాబులు!

## 289

సనేమిరా ఈ సంఘంలో
నిరుద్యోగి
ప్రేమ సంతకం
చెల్లనేరదు

## 290

గుడిసెలే
మేడల్ని
కడతాయి
అయినా
మేడలే
గుడిసెల్ని
కొడతాయి.

## 291

'అడల్ట్స్ ఓన్లీ' ఎందుకని?
పిల్లల్ని హడలగొట్టేందుకని.

## 292

విక్స్ ఇన్ హేలరంత లేదు
వియత్నాం యుద్ధం గురించి
మాట్లాడటం
విచిత్రమే

## 293

శవాలమీది చింకిపాతలూ
శయనమందిరాలైన రోడ్లూ
కళ్ళు నులుముకుని లేచి
పేగుల్లోకి ఆకల్ని
దోపుకుంటున్నప్పుడు
టైమెంత...?
సరిగ్గా
గరీబోనికి దొరకని చాయంత
ఈ దేశంలో దగాపడ్డ జాతంత

## 284

స్టెతస్కోపు
రక్తం పీలుస్తుంది
నల్లకోటు
న్యాయం కొల్లగొడుతుంది
సిమెంటు
ఇసుకతో లాలూచీపడుతుంది
స్విమ్మింగ్ పూల్లో
సుందరీమణి ఈదులాడుతుంది.

## 295

ఆఫీసుల్లో
అవేమిటో
తిమింగలాలట
సముద్రాన్నే
మింగాలను
తాపత్రయమట

## 296

కత్తి
కిరాతకంగా
వ్యవస్థ గుండెల్లో
దిగబడి
ఆపై కనిపించేదే
దోపిడీ
పిడి

## 297

మారుమూలలల
సందుగొందుల నించి
మహానగరాల
రహదారుల వరకూ
మనం చెమటకి విధించే
శిక్షే
ఈ దేశపు
రిక్షా!

## 298

వాసనలేని
ఖద్దరు పువ్వులా
కాంగిరేసు...!
కళాపోషణ కరువైన
కాషాయంలా
అన్న ఫేసు...!!

## 299

గంటల తరబడి
చక్కెర కొరకు
క్యూలో నిలబడే
చీమలు...
ప్రభుత్వాన్ని కుట్టలేవు
తట్టలేవు!

## 300

జనమనే
జడపదార్థం
కరిగి, కదిలి
ప్రవహించగలిగిందెప్పుడో
చెప్పవే కాలమా...
క్రికెట్ మాయాజాలమా!

## 301

గుండెలవిసేలా
ఏడ్చినా..
గుండె లేనితనంతో
నవ్వేది ఎవ్వరు...?
తుపాకీ,
లేదా తుఫాను!

## 302

బంగళాల
గొంగళి పురుగులు
నా వంటిమీద
పాకినప్పుడల్లా
నాకు
మహానగరాలు గుర్తొస్తాయి
మన హైదరాబాదు
గుర్తొస్తుంది...
కన్నీళ్ళలోకి దూకి
ఒక అభాగిని
ఆత్మాహుతి చేసుకున్నప్పుడల్లా
నాకు
దుఃఖసాగరాలు గుర్తొస్తాయి
మన హుసేన్‌సాగర్
గుర్తొస్తుంది...

## 303

కలిగినోళ్ల
క్యాష్ రోడ్లు
నగరంలో క్రాస్ రోడ్లు...

## 304

మాడరన్ ఆర్ట్
గ్యాలరీలో
కనిపిస్తే ఒక
ఖాళీ (ఫ్రేమ్)
చిత్రమేముంది
మిత్రమా
ఊహించుకో అది
గాలి (టైటిల్)

## 305

గడ్డి పరకను
విడిగా చూసి
అసహ్యించుకోకు
అది ప్రకృతి శోభకు
దోహదం చేస్తున్నప్పుడు
చూడు !

## 306

ఈ దేశానికి
స్వాతంత్ర్యమొచ్చింది
నైంటీన్ ఫార్టీ సెవెన్
నలభై నాలుగేళ్ల
ఆకలి, నిరుద్యోగం కలిసి
మనకిచ్చిందొక
ఏ.కె. ఫార్టీ సెవెన్!!

## 307

అప్రజాస్వామిక
మొండానికి
బ్యాలెట్ పెట్టే
తలకాయైతే
దేశమా
నువ్వే నా
కృత్రిమ శ్వాసకోశమా...?

## 308

'కుట్ర'నే పదాన్ని రాజకీయాల్లో
పొదిగితే.
ప్రకాశించినట్టు
మరేది
ప్రకాశించదు!

## 309

అయిదు భాగాలుగా
విభజించిన
అద్భుత లోహం
నా చెయ్యి
అణు వణువూ
అన్యాయాన్ని
ధ్వంసించేందుకు
మిత్రుడా !
నాతో కరచాలనం చెయ్యి!

## 310

పాలరాయి
రక్తం
పీల్చేస్తుందనడానికి
ఒకే ఒక్క
చారిత్రక నిదర్శనం
తాజ్ మహల్!

## 311

నగరంలో
అద్దెవాళ్ళూ
ఇంటి యజమాన్లూ
ఎప్పటికీ
కొట్టుడుపోని
సరీ, బేసి సంఖ్యలు

## 312

నీ హృదయాన్ని
బార్లో బీరు మూతలా
తెరిస్తే తెరిచావ్
నీ లోంచి ఉప్పొంగని
ప్రేమ కవిత్వం
మాత్రం...
నాలోకి వొంపకు?
నన్నైతే చంపకు?

## 313

పిచ్చివాడా!
నువ్వస్తమానం
నాలుకతో నాకటం
అభ్యాసం
చెయ్యగలగాలి గానీ
నీ ముక్కుమీద అతికించిన
ఒక అన్నం మెతుకే
అభివృద్ధి పథకం!

## 314

మొదలు
భలే కలిగించి
ఎంజాయి

ఆ పిదప
కొంపముంచేదే
గంజాయి

## 315

సర్సరీ...
పుట్టి
ఏడాదిన్నరైందో
లేదో
వాడూ నర్సరీ

## 316

అపర నారదుడిలా బొట్టు
జనపనారలా జుట్టు
అడుక్కోవటమే
అద్భుత కళగా
వాడెక్కుతున్నాడు
ప్రతి ఇంటి మెట్టు!

## 317

ఏ నాగరికతా కుండీలో
విరిసినా
ఏమున్నై రెండాకులే
పొగాకు
తేయాకు

## 318

శవ ప్రాయమైన
పథకాలైనా
శవాలతో సమానమే గనుక
నా దృష్టిలో
ఒక్కో రాజకీయ నాయకుని మది
ఒక మార్చురీ గది

## 319

సభ్య మానవ ప్రపంచమా
కాదిది
మానభంగ వేదిక
పురాణాలు
ప్రబంధాలు
పురుషాహంకారం వెరసి
ఆడది
క్షణికమైన కోరిక!

## 320

ప్రతి సినిమా పోస్టరు
నెత్తుట్లో తడిసి
వెండి తెరలన్నీ
ఎర్ర జెండాలైతే
విప్లవాలన్నీ
వినోద భరితాలే...

## 321

*గత్యంతరం లేక*
*గతికే రంగునీళ్ళ టీ*
*దోస్తులు ముగ్గురూ జేరితె*
*దో ఛాయ్ ఏక్ ఎమ్‌టీ*

## 322

ఇది వరకు
రెండు చేతుల్తో
గడియారం
గుండైనా
బాదుకునేది
ఇప్పుడదీ లేదు
పాపం దానికి
అంకెల
సంకెళ్ళేశారు!

## 323

నానా తెలుగు సినిమా గడ్డీ
కరిచేవాడికి
నానా పాటేకర్
రుచించునా....!

## 324

డబ్బున్న వాళ్ళు
ప్రయోగించే
సిమెంట్ రాకెట్
ఆకాశ హర్మ్యం!

## 325

సంవత్సరాల తరబడి
నిర్వహించలేని
యాగం
నాన్నా... నిరుద్యోగం

## 326

పార్టీ ప్రచారాల
నిలువెత్తు అలల
సంద్రంలో పడి
ఓటు
ఇప్పుడూగిసలాడే
బోటు

## 327

ధగ ధగా
మెరుస్తున్న
రోల్డు గోల్డు
నగలు...

జనాన్ని
'దగా' 'దగా'
చేస్తున్న
రాజకీయ సభలు...

## 328

వీపు
బొజ్జా
వేరు వేరు పార్టీ
వీడేనండీ
రాజకీయ
కొజ్జా!

## 329

పై కప్పులా
నీ మేకప్పుని
తొలగిస్తే
ఓసి
నీ ముఖమెంత
బోసి!

## 330

తీసుకున్న
ఓట్లన్నీ
మావి..
తీరా
మా బతుకే
ఎండ మావి...

## 331

"మాల్ గాడీలో
గాడిదల్ని
పెట్టుకొచ్చినట్టు
ఇదేవిటండీ బాబూ
ఇంత బరువుంది...?
"అదే
తెలుగు సినిమా పెట్టే...”?

## 332

రెండు విసర్గలు
కలిపితే
ఒక సున్నా
పన్నెండున్నర
దీర్ఘకాలిక పథకాలు
అల్లితే
మన చెన్నా

## 333

భుక్తిమార్గం చూపలేని
ప్రభుత్వమే
ప్రజలకంట్లో నలుసై
బాధిస్తే...
వేధిస్తే...
ఏర్పడిన ఎర్రజీరే
తీవ్రవాదం
ఉగ్ర "వేదం"!

## 334

ఎవరి కన్నుల్లో
ప్రసరించే వెన్నెలో
ఎవరి కడుపుల్లో
కదలనీ చల్లనో
ఈ రంగులొలికే
రామాయణం
ఆ 'రామానందా
సాగ'రం!

## 335

ఎన్టీయార్ పాలనలో
ఎన్నెన్నో
ప్రగతి మెట్లు
ఉదాహరణకి
హెల్మెట్లు!

336

పబ్లిక్ గార్డెన్స్‌లో
సాధారణంగా
ప్రేమికులు
అందమైన
'ఫ్రేమి'కులు

337

పెరిస్ట్రోయికా
శాస్త్రజ్ఞుడు
గోర్బచెవ్ సారు
గ్లాస్ నోస్తు
దోస్తులైన
జార్జి బుష్షుగారు
పెట్టుబడికి
బొట్టు పెట్టి
హారతివ్వలేరా?

338

చాలి చాలని
సాంబారుతో
స్నానించే యిడ్లీ.
పలుచనైన
పథకాలతో
ప్రవహించే చట్నీ

## 339

*రౌండ్ టేబుల్ సమావేశంలా*
*బొడ్డు చుట్టూ*
*పద్నాలుగింజెక్షన్లెందుకు*
*కుక్క కరిచినందుకు*
*పిక్క లాగినందుకు!*

## 340

*గడియారం*
*తలుపులు తెరుచుకోవడమే*
*తరువాయి*
*కొంకీలకి తగిలించిన*
*తాజా మాంసంలా*
*అంకెలు కాలాన్ని*
*ఖైమా చూస్తూ*
*సెకన్ల ముల్లు*

## 341

*'దొంగ' సినిమా*
*నిర్మాతలకి*
*వేరే దిక్కేదీ!*
*సగటు తెలుగు ప్రేక్షకుడి*
*జేబే*
*రోజూ దక్కేదీ*

## 342

వదులు వదులుగా
అనుభూతుల జడలల్లుకు
మురిసేవాడు
వర్గకసితో
కవిత్వమెప్పుడూ
రాయలేడు

## 343

పగిలిపోయిన అద్దం
పళ్లూడిన దువ్వెనా
దారిద్ర్యంలో మగ్గుతున్న
దంపతుల తీరే

## 344

ఎన్నికల్లో
ఎవరి 'పళ్ళు' వాళ్ళు
రాల్చుకునేటందుకు
పద్దెనిమిదేళ్లా
పౌరుడైతేనేం!
అజ్ఞానం మెట్లమీంచి
జారుడైతేనేం!

## 345

ప్రభుత్వం
వొంటి మీద
ఎప్పుడూ మెరిసే
సొమ్ములే...
సమ్మెలు!

## 346

ఏ
అరాజకీయాల
రాయిని
ఢీ కొన్నా...
ఫలితం ఒక్కటే
ముఖం పగిలిపోవడం!

## 347

మనిషి మనిషీ
మూగ బాధ
మళ్ళీ కూడికలెందుకు
తీయటం
గుండె గుండెకీ
ఆవేశం
గుణించి చూడు
ఎంతౌతుందో

## 348

పాటకీ
దుఃఖం మూటకీ మధ్య
వీళ్లెవరు
చీకటి గుహకీ
వెలుతురు ఖండానికీ మధ్య
వీళ్ళెవరు
మృత్యుభయానికీ
సాహస కృత్యానికీ మధ్య
వీళ్ళెవరు
మనుషులే
గాయపడ్డ మనసులే

## 349

ఎంత చేసినా
ఎడారుల్లోకి
మీ సంస్కరణల నీళ్ళు రావు
అయ్యా
మా
పి.వీ. నరసింహారావు!

## 350

వేల
సంవత్సరాలుగా
వేలి ముద్రల్లోంచి
వెలికి తీయలేని
హంతకుడే...
రాజకీయుడు!

## 351

కడుపు మీద
తడిసిన అగ్గిపుల్లతో
గీసినా
భగ్గున మండితే
అదేరా
ఆకలి!

## 352

ఇక గోర్బ 'చెవ్'
వినదంట
యుద్ధాలహోరు
అమెరి'కన్ను'
తెరవదంట
అణ్వస్త్రాల డోరు
మూడో ప్రపంచ దేశమా
ముక్కున వేలేసుకో!

## 353

పరిశ్రమల
ఉఛ్వాస నిశ్వాసల్లో
ఎగిసిపడే
స్వేద బిందువుల హారం
కార్మికుడి
కళ్ళు గప్పి
దొంగిలించడమే
దోపిడీ వ్యవహారం

## 354

చుట్టూరా ముసిరిన
దుఃఖాన్ని
చెదరగొడితే
చుండూరులో మిగిలిన
శవాలెన్ని...
అగ్రవర్ణాల
కండకావరానికి
అండగా నిలిచిన
ఖాకీ
కవచాలెన్ని...
అనాదిగా
అసంఖ్యాకపు ఓట్లుగా
హరిజన చర్మాన్ని
కత్తిరించుకునే
అవకాశవాద రాజకీయాలెన్ని...?

## 355

లోపభూయిష్టమైన
వ్యవస్థే
వ్యక్తుల్ని తుపాకులుగా
తీర్చిదిద్దుతుంది

## 356

ఎల్లలు లేని
కవితాకాశంలో
ఎవరెవరి బాధలైనా
రాస్తా...
క్షమించండి
నా ఒక్కడివి మాత్రమే
దాస్తా...

## 357

నలుగురు మనుషులు
కల్సి
పొడవాటి
అడ్వర్‌టైజ్‌మెంటు బోర్డుని
మోసుకెళ్తున్నప్పుడు
నాకు స్ఫురించేది
కట్టిన తెలుగు సినిమా పాడె...

## 358

అసెంబ్లీలో
పేలని
ఔట్లు
ప్రతిపక్షాల
ధర్నాలూ
వాకౌట్లు

## 359

అన్నా!
నువ్వెంతటి
బడాయి
రాజకీయాల 'డబ్బా'
ఊపినా
మాకు వినిపించే వన్నీ
అస్థిపంజరాల గలగలలే...

## 360

రాష్ట్రకాంగ్రెస్
చిలుమెక్కి
తూట్లు పడ్డప్పుడల్లా
కళాయి పోసి
తళ తళా మెరిపించేది
కేంద్ర బృందమే.

## 361

"ఈ గుప్పెడు మనసుని
నీ హృదయపు వేదికపై
మంచి ముత్యాలుగా
జాలు వార్చనా
నా చిటికెడు నెత్తురుతో
నీ కనుబొమల మధ్య
అరుణారుణ సూర్యబింబంగా
అవతరించనా."
"నీలాంటి నిరుద్యోగిని
ప్రేమించినందుకు
నా బతుక్కి మిగిలేది
కవిత్వమేగా!"

## 362

రెండేళ్ల మా చిన్ని గాడు
రోజూ యింట్లో
ఒకటే పోరు
ఓ పోలీస్ స్టేషన్
కొనిమ్మని...
నేనన్నా
"మహామహులూ
మంత్రులూ
కొనుక్కునే వ్యవహారం
మనకెందుకు నాన్నా"...?

## 363

రోడ్లపై చేరి
చందాలు
సేకరిస్తున్నాయి
అందచందాలు
బృందాలుగా చీలి
అద్దాలు
పగలగొడుతున్నాయి
చదువుల మకరందాలు
రిజర్వేషనూ
నువ్వింకా
రాజుకోవేమే...?

## 364

మనుషుల మానప్రాణాలకి
రక్షణ లేదని తెలిసినప్పుడు
రైలూ తగలబడి పోతుంది
రైల్లోని ఆడదాని శీలమూ
తగలబడిపోతుంది
అంతా బూడిదయ్యాక
సద్దుమణిగాక
ఏ రాజకీయ ప్రమాణాలూ లేని
ఒక .....నీతి
ఓట్లడుక్కునే జాతి – మాత్రం
ఈ దేశంలో
గగ్గోలు పెడుతూ ఉంటుంది!

## 365

దొంగిలించబడితే
నోటికాడి
కూడు
ఆకలీ
దారిద్ర్యమే
అజ్ఞాత హంతకుడు!

## 366

ఎలక్ట్రిక్ గిటార్లా
నగరంలో రోడ్డు
అడుగేస్తే
సంగీతం
కాదు కాదు
సమరగీతం

## 367

కలర్ కంప్యూటర్లొచ్చి
కళ్లల్లో గుప్పిస్తే
ఇంద్ర ధనుసులు

చిన్ని చిన్ని
స్టూడియోలకి
పాస్ పోర్ట్సే
పప్పు దినుసులు

## 368

తన హృదయమనే
తేనెపట్టు
తాకితే
టీనేజీ తేనెటీగ
కుట్టదా....
చుట్టుముట్టదా...

## 369

నాజూకైన
ఆడదాని
వేళ్లు.....
అంతర్లీనంగా
అడ్వర్టైజ్‌మెంట్

ప్రపంచంలో
పాదుకున్న
వేళ్లు...

## 370

రాత్రికీ ధాత్రికీ
యుగయుగాల
అనుబంధం
గుండెకీ
గడియారానికీ
అవినాభావ సంబంధం

## 371

గులాబీ రేకులే
గులామీ బతుకులై
పగలూ రాత్రి
విలపించే దెవరది...?
యింకెవరూ.... ఆడది!
'మెహెందీ'ల వాడది!!

## 372

ఏకంగా
ఈ దోపిడీ వ్యవస్థకంతా
కలిపి
ఒకే ఒక్క తలకాయుండి
ఉంటే....
నేనేనాడో
దాని పీక నులిమేసేవాన్ని!

## 373

అపచారం అపచారం
ప్రచార సభల్లో
నాయకులు చేసే ప్రసంగాలు
మన నాలుకలపై
అచ్చేసుకోరాదు
మన యిళ్ళలోకి
తెచ్చేసుకోరాదు

## 374

భారద్దేశం చూరునించి
బొట్లు బొట్లుగా
కారుతున్న
దరిద్రమే
బతుకు బొక్కెనలతో
తోడలేని
బాధల
సముద్రమవుతుంది!

## 375

రైళ్లైనా
రాజకీయాలైనా
పట్టాలు తప్పితే
ఎప్పుడూ
జనానికే
జీవన్మరణ సమస్య!

## 376

గాంధీ
సుబాస్ చంద్రబోసూ
పుట్టిన ఈ దేశంలో
ఎంతమాటెంతమాట
మన జేబులో
ఒక దొంగ పాసు!

## 377

కమ్ముకున్న
కష్టాల కారుమేఘాలు
చీల్చుకుని
నమ్ముకున్న
ఏ కార్మిక చట్టాలూ
ఉదయించనప్పుడు
రాత్రింబవళ్ళూ
మీ చేతులు చుట్టే
బీడీలే
మీ చేతులకెయ్యని
బేడీలై
ఓ అక్కా చెల్లెళ్లూ....

## 378

నీలాకాశం కాన్వాసుపై
రెండు
తెలతెల్లని మేఘాలద్ది
నాకూ అందాలు
తీర్చి దిద్దాలనే ఉంది
కానీ.... ఏదీ....
కుంచెని
గుండె నెత్తుట్లో
ముంచి తీస్తే
అంతా రక్తవర్ణమే...!

## 379

ఇన్నాళ్ళూ
రక్షణ కవచం లేని
రహదారుల మధ్య
చిందిన నెత్తుట్లో మనం
మనుషుల్ని
మతకలహాల చితులు చేసి
మండించిన
మంటల్లో మనం

ఇవాళ

చితాభస్మ కలశాల్లో

చిగురించిన భవితవ్యం

మనం...!

## 380

అక్షరాల్ని

చెరిపేసినంత

తేలిగ్గా

అస్థిపంజరాల్ని

విరిచేసినంత

సులభంగా

ఈ దేశంలో

ధనస్వామ్యం

జులుం

చెలాయిస్తోంది

## 381

సౌందర్యాలూ

వికారాలూ

కలగలిపి చూసేవి

కళ్లు

విడదీసేవి

మెదళ్లు–

## 382

రుతుపవనాల
మాటేమో కాని,
నిరంతరం
నగరంలో వీచేవి
'మారుతి' పవనాలే!

## 383

సత్తురూపాయిని
గుండెలకి హత్తుకుని
భోరున
ఏడవాలనే ఉంది
ఏం చేద్దాం
నోటి మాటా పడిపోయింది
'నోటూ' మాటా
పడిపోయింది!...

## 384

సంతలో
రాసులుగా పోసి
అమ్మితే
నగరంలో
వసంతాలూ
పూల కర్మాగారాలే!

## 385

స్నేహ ప్రపంచంలో
విహరించే
గుండె పక్షికి
ఆశలూ,
ఆకాంక్షలే
అందాల రెక్కలు.

## 386

ఆదివారాల్ని
ఆరాధించే
ఉద్యోగులెందరున్నా
'ఫిబ్రవరిని' ప్రేమించే
సామూహిక
హృదయమొక్కటే

## 387

ఎదురెదురుగా ఇద్దరు
నిరుద్యోగులు
తటస్థపడితే

ఒకరి గడ్డం

మరొకరికి

అద్దమౌతుంది...!

అర్థమౌతుంది.....!!

## 388

జనారణ్యంలో

పెంచి, పోషించబడే

పులి–మతం

దానాకలి

తీర్చాల్సినప్పుడల్లా

నువ్వో నేనే–ఖతం!

## 389

సలసలా

కాగుతున్న

ఈ కన్నీళ్లు...

మన మన

బతుకు పరీక్షనాళికల్లో

ఇంకెన్నేళ్లు........

## 390

హైదరాబాదనే
మహావృక్షమ్మీద
ఎవరికి వారే
ఏకాకి

## 391

అధికారం అరచేతిలో
అహర్నిశల తోలుబొమ్మ
అంగాంగం–కీలుబొమ్మ
ఎవరే..... నువ్వెవరే...
యింకెవరూ – నేనే
ఖాకీ దుస్తుని
క్రౌర్యానికి గుర్తుని!

## 392

అక్రమ
మార్గాల
గుండా
ప్రవేశంచువాడు
– గూండా
ప్రవహించునది
– గుడుంబా

## 393

గదిలో
పుస్తకాల్ని
విశాలంగా పరిస్తే
అక్కడే ఏర్పడుతుందొక
విజ్ఞాన జలధి
మదిలో
పుస్తకాల్ని
నిటారుగా పేరిస్తే
అక్కడే
పెరుగుతుందొక
నిరుద్యోగ పర్వతం

## 394

అంతేసి అంతస్తులకి
పునాదుల్ని పరికించే
తీరికే దొరకదాయె
అసలు
సంభవమే కాదాయె.....
మట్టిలోని వేళ్లకి
చెట్టు కొమ్మల్నందుకునే
భాగ్యమే కలగదాయె
స్పృశించే
అర్హతే లేదాయె...

## 395

ఒకే ఒక్క
ధాన్యపు గింజని
నీ కన్నీటిలో ఎసరేసుకుని
కడుపునిండా తినమన్నవాడే..
ఒకే ఒక్క
దారప్పోగుని
నీ వొంటి నిండా
వస్త్రంగా కప్పుకొమ్మన్నవాడే..
నీలోని పత్రహరితాన్ని
బ్యాలెట్ పత్రంగా
నలిపేసే
త్రాష్టుడు!

## 396

ఖండాలన్నీ
విసిరేయబడ్డ
అన్నం ముద్దల్లా
చుట్టూ సముద్రాలే
అవురావురంటూ
తెరుచుకున్న నోళ్లలా

ఆకలే చరిత్రని సృష్టించి
అన్నం ముద్దే
ప్రపంచాన్ని పాలిస్తున్నట్టు..

## 397

సామాన్యుడి
మణికట్టుకి చుట్టుకుని
గగుర్పాటు కలిగించే
పిల్లపాము – గడియారం
మధ్యతరగతి
ఇంటి గోడలపై వాలి
పగలూ రాత్రీ
భయపెట్టే
పన్నెండంకెల గుడ్లగూబ
– గడియారం

## 398

విశాలమైన ప్రపంచాన్ని
విస్మరించి
కలర్ టీ.వీ తెరపైన
కలలు కనేవాడే
నగర జీవి

## 399

‘చెక్కు’
చెదరని
అందాన్నీ
ఆనందాన్నీ
చెరిపేది
‘ఫోర్జరీ’

## 400

రాజకీయ గ్రంథాల
సారమేదీ
అంతు చిక్కనప్పుడు
మళ్ళీ సినిమాల
ఓనమాలే దిద్దుకో
అన్నా! నువ్
‘మేనక’ల పాదాలే
కళ్లకద్దుకో!

## 401

రవీంద్ర భారతులూ
ఉంటాయ్

రాక్ 'ఎన్' రోల్లూ ఉంటాయ్
తకధిమి తోమ్‌లూ ఉంటాయ్
త్యాగరాయగానసభలూ
ఉంటాయ్
ఓరబ్బీ!
నీకేదిష్టంరా....?

402

నా కవిత్వం బ్యాంకులో
దాచే
అక్షర లక్షలన్నీ
అక్షరాలా
మీకే.

403

ఒక కంట
వెలసిన
ఆనంద భాష్పం-
మరో కంట
ఉబికిన
విషాదాశ్రువు-

ప్రకృతీ!

చిత్రమైందే

నీ ముఖమ్మీద వర్షాకృతీ–!

## 404

అనవాలు లేకుండా

ముఖాల్ని

చెక్కడం....

ఓనమాలు రాకుండా

ఓటర్ని

చెయ్యడం.....

మన ఎన్నికల గొప్పే!?

## 405

రాజ్యాంగమనే

గాజు ఫలకంలో

వుంచిన

వాసనలేని గన్నేరు

రాష్ట్ర గవర్నరు!

## 406

మంత్రికొడుకు
మాఫియా గ్యాంగులో
కలిస్తే
మాఫ్ కర్‌దో
కుబేరుల వారసులు
కుంభకోణాల్లో
చిక్కుకుంటే
కేస్‌మే
ఇన్ 'సాఫ్'కర్‌దో!

## 407

రాక్షసంగా ఎదిగిన
ఎన్నికల పాదాల
కింద
నువ్వెప్పుడూ
చీమవేరా
ఓటరూ!

## 408

జవసత్వాలు లేని పాట
జనంలో
బతకదు!

జరీ అంచు చీరతో
విప్లవం
మెరవదు!!

## 409

జీవితాంతం
మొ'గుడి' ముందు
చేతులెత్తి నమస్కరించే
భక్తురాలే
సంసారంలో
శక్తిహీనురాలు!

## 410

ఒకరి మోచేతి నీళ్లు
తాగే
నీచత్వం కన్నా
మోచీపని
పాకీపని
ఉత్తమోత్తమం

## 411

నెల నెలా
చెల్లించాల్సినవి
చెల్లించకపోతే

‘ఖాతా’లే

బంగాళాఖాతాలై

భయపెడతాయ్

బ్రదర్!

## 412

తిరోగమనమే

తన దారైన

తెలుగుసినిమా దెయ్యానికి

చూశారా

పాదాలెప్పుడూ

వెనక్కి -

వెనక్కి -

## 413

రోజుకో

వాగ్దానాల

మృత శిశువుని

ప్రసవించే ప్రభుత్వానికి

మంత్రులే....

మంత్రసానులు!

## 414

క్రిక్కిరిసిన ప్రేక్షకులూ లేరు
కిరీటధారులూ లేరు...
తెరమరుగౌతున్న
సురభి నాటక సమాజమా
దుర్లభమౌతున్న జీవితం
దుఃఖ సన్నివేశమే
నిజమిప్పుడు....

## 415

ఉస్మానియా యూనివర్సిటీ
విద్యార్థులు
తమ
వసతులు చక్కదిద్దాలనే
తమ
కోర్కెలు పరిష్కరించాలనే
విజ్ఞాపనా పత్రాలు
వీ.సీ. కి అర్పించినా ఒకటే
'మూసీ'కి సమర్పించినా
ఒకటే

## 416

దయనీయమైన స్థితిలో

ఒకరి చవకబారు

సుఖంకొరకు

ఆమె

తన రవికెముడి

విప్పుతుందో

లేదో....

పచ్చిగా

అయిదుగురి, పిచ్చివాళ్ల

సామూహిక

విధ్వంసకాండలా

ప్రబలిపోతుంది... వీడిచెయ్యి

నిజంగా

ఈ ప్రపంచమెంత

నీచమైంది.....?!

## 417

రక్షక భటుడా

యినుప ఊచల వెనుక

నువ్వేం చేసిన చెల్లు

దృశ్యా దృశ్యంగా

జీర్ణమైనాక

మూసుకొనేవే

రాజకీయాల కళ్లు

## 7

## మరణం నా ఊపిరి చరణం కాదు

వేదనాభరితమైన నా కవితాక్షరాన్ని
'వేశ్యా' వాటికనే పలకమీద దిద్దుకున్నప్పుడూ
అక్షరనేత్రం తెరిచి ఆనాటి 'దొర'తనాన్ని
ఆగ్రహించినప్పుడూ
బహుశ నాకు పద్దెనిమిదేళ్లు
సిద్ధాంత గ్రంథ సారమేదీ వడబోయకున్నా
సిద్ధార్థుడు వదిలివెళ్ళిన ఈ రాజ్యమ్మీద
నెత్తుటి ధారలు కడిగేందుకు
కవిత్వం నాకవసరమై ఆయుధమై యిప్పటికి
పద్నాలుగేళ్లు
అంచెలంచెలుగా ఆనాటి నించి కవిత్వం రాస్తున్నా
జీవితమనే అనేకానేక సంఘర్షణల వెనుక
నాలోంచి చిత్రకారుడు అంతరించిపోతున్న బాధేదో
నన్ను వేధిస్తుంది.

## కవితల క్రమం

# మరణం నా చివరి చరణం కాదు

మరణం నా చివరి చరణం కాదు
మౌనం నా చితాభస్మం కాదు
మనోహరాకాశంలో విలపించే చంద్రబింబం
నా అశ్రుకణం కాదు

నిర్విరామంగా నిత్యనూతనంగా
కాలం అంచున చిగురించే నెత్తుటి ఊహను నేను
కలల ఉపరితలమ్మీద కదలాడే కాంతి పుంజం నేను
కన్నీళ్లకి కర్తవ్యాన్ని నిర్దేశించే దిక్సూచిని నేను
అగ్ని పద్యం నేను దగ్ధగీతం నేను అక్షరక్షిపణి నేను
ఆయుధాలుగా రూపాంతరంచెందే ఆకలి నేపథ్యం నేను
అడవి నేను – కడలి నేను
ఉప్పొంగే మానవ సమూహాల సంఘర్షణ నేను
అజ్ఞాతంగా అంతర్లీనంగా
మట్టిపొరల్లోంచి పరివ్యాప్తమవుతున్న పోరాట పరిమళం
నేను

శుష్కించిన పల్లెనుంచి శిథిలమైన బతుకునుంచి
శూలమైన చూపునుంచి
పరాధీనమౌతున్న స్వేదంలోంచి ఆవిర్భవించిన
మంటల జెండాల జాతర నేను మందుపాతర నేను
లోపభూయిష్టమైన వ్యవస్థలో లోహంగా మారిన పిడికిలి
నేను

సంపదల సమతుల్యం కోసం
దోపిడీ వటవృక్షాన్ని నేలకూల్చే సైనికుల సారథ్యం నేను
చరిత్రపుటపై చెక్కుతున్న చెక్కుచెదరని సత్యం నేను
హింసకు ప్రతి హింసను నేను
హిట్లర్లూ హిరణ్య కశిపుల ధ్వంసం నేను
ఈ దీర్ఘకాలిక యుద్ధవ్యూహంలో
పీడితుడే నా అస్త్రం - అణ్వాస్త్రం
శత్రువు నా పాదధూళి

## అరచేతిని అడ్డుపెట్టి...

రాజముద్రే రక్షాకవచమై
వాడిని ఎన్నాళ్లు రక్షించగలదు
చట్టం పుట్టలోంచి పడగవిప్పి
నియంతృత్వం ఇంకెన్నాళ్లు బుసకొట్టగలదు
మనలోని అసమానతల నిష్పత్తిని
వాడి కోటానుకోట్ల సంపత్తిగా
ఇంకెన్నాళ్లు దాచుకోగలడు
ఓటుతో వాడింకెన్నాళ్లు
కాటు వేయగలడు.
పదవుల సింహాసనాలపై నుంచి
ప్రజల్ని ఇంకెన్నాళ్లు హింసించగలడు

ధైర్యాన్ని దేదీప్యమానంగా వెలిగించగలవాళ్లు
చీకటి చెరసాలలోంచి దేశాన్ని రక్షించుకునేందుకు
అంచెలంచెలుగా తరలి వస్తున్నారు
ఇక వాడి అంతం తప్పదు

## శత్రు శిబిరంపైకి...

మరణ శాసనాన్ని తిరగ రాసిన
మందుపాతరే
శత్రువు శరీరాన్ని
ఛిన్నాభిన్నం చేస్తుంది
గర్భశోకాన్ని దిగమింగి
అధిగమించిన అడవితల్లే
కల్లోల తరంగాల్ని ఛేదించుకొని
కదన రంగాన దూకుతుంది
మృత్యువుకీ మృత్యువుకీ మధ్య
నెలకొన్న పోరాట సారమే
మృగమ్మీదికి మనిషిని మళ్లీ పురికొల్పుతుంది
రక్తం పురివిప్పుకొని
శత్రువుపైకి తపంచా విసురుతుంది
భుగభుగమండే కన్నీటి ఆమ్లమే
ఉవ్వెత్తు ఎగసిన
నెత్తురు కెరటాల వలయమై
శత్రు శిబిరాన్ని ముంచెత్తుతుంది.

## వీరుణ్ని కలగనాలి

దేశాన్ని పోగొట్టుకున్న గర్భశోకం నుంచే
మళ్లీనేనొక వీరుణ్ని కలగనాలి
దిక్కులుకూలిన దుఃఖం నుంచే
దిగంతాల అంచులు దొరకని ఆక్రోశంనుంచే
మళ్లీ మళ్లీ కుప్పకూలిపోతున్న మరణశయ్యమీంచే
నన్ను నేను ఆయుధంగా మలుచుకోవాలి
శరీరం శిథిలాయుధమైనా
యోధుడిగా మునుముందుకే కదిలి
కదనరంగాన్ని వశపరచుకోవాలి

## సరంగు

ధ్వనికీ ప్రతిధ్వనికీ మధ్యనేను
హింసకీ ప్రతిహింసకీ మధ్యనేను
విధ్వంసానికీ నిర్మాణానికీ మధ్యనేను
వ్రణానికీ రక్తకణానికీ మధ్యనేను
వధ్యశిలలకూ కలలకూ మధ్యనేను
మౌనానికీ మానవాగ్నికీ మధ్యనేను
చిదిమిన గాయాలకూ చిందిన వెలుతురుకూ మధ్యనేను
కన్నీటిలోయలకూ కాంతి శిఖరాలకూ మధ్యనేను
అణచివేతకూ ఆయుధానికీ మధ్యనేను

## కవిత్వమింకా ఎరుపెక్కనీ

ఉద్యమాలు ఒరుసుకొని కన్నీళ్లింకా ప్రవహించి
కంటి ఎర్రజీరలో కవిత్వమింకా ఎరుపెక్కనీ
పొంగిన లాఠీదెబ్బలు చిందిన నెత్తుటి చారలే
రక్తనాళాల రహదారుల గుండా రహస్యంగా నడిచెళ్లి
వీరుడికి మళ్లీ ఒక అన్నం ముద్ద అందించనీ

ఉద్రిక్తమౌతున్న గాయాల మీదనుంచే
పల్లెల పల్లేరు గాయాల మీంచే
పరిపక్వమైన పోరాట సారమే
ఉబికుబికి రావాలి
ఉత్తేజం పొందాలి.

## ఆలోచించు

ముందు
ఈ వ్యవస్థలో
ఏ అభద్రతా భావం
బందూకుని చేపట్టిందో
అవలోకించు
ఆ పిదప

తీరిగ్గా
తీవ్రవాదానికి
తిలోదకాలిద్దాం
ముందు
ఏ రాజకీయవ్రణం
మానవ విలువల్ని
తొలుస్తోందో
పరిశీలించు
అటుపిమ్మట
త్రిలోకాల్ని
స్వర్గధామం చేద్దాం

## పోరాటసారం

ఘనీభవించే నిశ్శబ్దంలోనైనా
కనురెప్ప తెరుచుకొనే చప్పుడు వినకుంటే ఎలా
ఎంతటి నియంతృత్వపు రాత్రిలోంచైనా
రాతిలోయలోంచైనా
ఉదయకిరణం ఆస్వాదించకపోతే ఎలా
మానవున్ని శాసించే శిలాఫలకాలని ధ్వంసించ
మహోజ్వలశకాన్ని సృష్టించకపోతే ఎలా
వెలిగించకపోతే ఎలా
ప్రకంపించు వేలికొనల అంచుల్లోనైనా
ఒక పోరాట నిర్వచన సారాన్ని
స్వీకరించక పోతే ఎలా

## రక్తపుష్పం

అశ్రుకణం
రాల్చలేని
శిథిలనేత్రం
అనుభూతిని
కోల్పోయిన
శిలాస్తన్యం
ఆమెవరు... ఆమెవరు
అమావాస్యల
అట్టడుగున పడి
నలిగిపోయిన
మొగలిరేకు
పట్టపగలు
విధ్వంసంలో
పడి విరిగిన
చంద్రవంక.

## ఆసేతు హిమాచలం

రాజకీయాల స్కానింగ్‌లో
తేలిందేమంటే
గొంతులో క్యాన్సర్
పేగుల్లో అల్సర్
కిడ్నీలో స్టోను

ఈ దేశానికి
దేహమంతా
శస్త్రచికిత్స చేయాలి.

## పెకిలిద్దాం

మదిలో
మహిళా కళాశాల
హాస్టల్‌గదిలో
తాత్కాలికంగా కత్తులు మెరిస్తే
కలవరపడొద్దు

పుస్తకం
ఆపాదమస్తకం
కుహనా సాహిత్య విలువల్తో
కుళ్లిపోతున్నప్పుడూ
కలవరపడొద్దు

మందగించిన
సామాజిక చర్మం మీద
సామూహిక మానభంగమే
చీమైకుట్టినప్పుడూ
కలవరపడొద్దు

ముందు
జీవితాల్ని వక్రీకరించి చెప్పే
నీతిసూత్రాల చీడని
తగలేద్దాం

ఆపై
యిద్దరుకాదు
యిరవైవేల మంది దుండగుల్నైనా
వేళ్లతో పెకిలించగల
వ్యవస్థ కోసం పరిశ్రమిద్దాం.

## మార్చుకో

ఆయుధం కొసమీద
ఆదమరిచి నిద్రపోతున్నవాడా
లే....
ఆయుధం బరువుకింద
అణగారి బతుకుతున్న వాడా
లే...
చుట్టూరా ముసురుకొన్న
ప్రమాద సూచికల్ని
నువ్వు గోగుపూలనుకో
మార్చుకో...

# రహస్సంధ్య

సంపన్నుడి భవనం మీద ప్రసరించిన
తొలి సూర్యకిరణం
పెట్టుబడిగా పరావర్తనం చెంది
పెంకుటిళ్లకి పలుచని వెలుతురుగా విస్తరించి
దగాపడిన జాతి మీద దోపిడి మెలమెల్లగా ఒళ్ళు
విరుచుకుంటుంది.

పూరిగుడిసె మీద పేదగాలి రెపరెపలాడి
నినాదం నిలువునా చిరిగిపోతుంది
ఊచకోత ప్రారంభమవుతుంది
ఎన్నికలు మళ్లీ రంగంలోకి దిగుతాయి

అవార్డువన్నె తరిగి ఆసుపత్రివార్డులో ప్రభుత్వం
కుళ్లిపోతుంది
రేషన్‌కార్డు నలిగి నేరాలు విరబూస్తాయి
రక్తంలో సూక్ష్మక్రిమి చేరి క్రొత్త వ్యాధి ప్రబలిపోతుంది
కనుకొలుకుల్లోంచి స్వచ్ఛందంగా
స్వాతంత్ర్య బిందువొకటి రాలిపోతుంది

కళ్లు తెరుస్తూనే
ఆకలితో పేగులు
చింకి పాత్రలతో జరీపోగులు
పరాచికాలు మొదలెడతాయి

అప్పుడే పేదరికం డబ్బాలోంచి ఒలికిపోయిన
చివరి పంచదారగుళికా
చేదుఅనుభవాల్లో మిగిలిన ఆఖరి తీపి గురుతూ
చప్పరించడం మొదలై
సంసారాల్లో చప్పుడు మొదలవుతుంది
తొణికిసలాడే కన్నీళ్లలోంచే
మళ్లీ ఒక ఇంద్రధనుస్సు విచ్చుకుంటుంది
అక్షరం ఆనంద భాష్పమవుతుంది

* * *

రంగుమాసిన రంగస్థలం వెండితెరని పలవరించి
పలవరించి
మళ్లీ నిద్రలోకి జారుకుంటుంది
ఆర్ట్‌మూవీ ముఖం మీద వికృతంగా
స్ఫోటకం మచ్చలు ముసురుకుంటాయి

దర్శకత్వానికి ముందే దగా జరిగిపోతుంది
స్క్రీన్‌ప్లే రాయకముందే సినీతార చర్మం చెదలెక్కుతుంది
గంజి ఆరకముందే అపరంజి బొమ్మల్ని చించేసుకుని
మురికివాడలు మురిపెంగా దాచుకుంటాయి

రాత్రంతా విలాసంలో గడ్డకట్టుకుపోయిన తిరుగుబాట్లూ
మద్యపానంగా వొలికిపోయిన మేధావుల ఆలోచనలు
లక్ష్మణరేఖలు గీసుకున్న ఉద్యమాలు
రంగుల్లో ముద్రించుకున్న ఉద్రేకాలు

శృంగారలీలల్లో చల్లారిపోయిన అంగారాలు
లేచి మెలమెల్లగా నవలల్లో వేడెక్కుతుంటాయి

అశ్రుకణంగా దొర్లిపోతున్న అనాధబాలుడి కథో
ఆకలిపొలిమేరల్లో దొరికిన ఆశావాది శవమో
ఆర్తనాదంలో చిట్లిన ఆడదాని స్వరమాధుర్యమో
కన్నీటి నేపథ్యంలో తడిసి పత్రహరితాన్ని
పోగొట్టుకున్న బతుకు చెట్టో
పత్రికా విలేకరి కంటపడి పరవశించి పోతాడు

మొగ్గతొడగక ముందే ముత్యాలముగ్గు రాలిపోతుంది
మట్టి మనుషుల్ని సృజించకముందే
రంగులకల కరిగిపోతుంది
పొట్టపట్టుకుని ఎక్స్‌ట్రాలు ముష్టెత్తటం
పొద్దున్నే విద్యార్థులు డిగ్రీల వర్షంలో ముద్దగా తడిసి
వణికిపోవటం
అక్షరాన్ని భిక్షాపాత్రిక చేసి ఆకాశవాణి ముందు
అడుక్కోవటం
సభలో స్తంభించిన చప్పట్లని
అర్భకుడెవడో చెవులు రిక్కించి వింటూ ఉండటం
కవి ఊహల్లో కత్తిరింపు చిత్రంలా మిగిలిన
అందగత్తెవరో

పత్రికల గాలిసోకకుండానే మూర్ఛపోవటం
వాతావరణం విచిత్రంగా మారిపోతూ ఉంటుంది

పత్రికల్లో నిజం పొక్కకుండానే
పంచరంగులు ప్రజల్ని మాయచేస్తాయి
ప్రణాళికలు తెగిన గాలిపటాలవుతాయి
సంపాదకీయం స్థానభ్రంశం చెంది
సంక్షోభంలో చిక్కుకుంటుంది
పట్టాలు తప్పి ప్రభుత్వానికి ప్రమాదం సంభవిస్తే
చీలిన పార్టీ నాలుక రక్తదాహమేస్తుంది
చూపుడు వేలు తెగిపోయి
చూపు ప్రశ్నార్థకమై దిక్సూచి రక్తసిక్తమవుతుంది

పురుషాధిక్య సమాజంలో మగతనం మొరగటం
మధ్యతరగతి మహిళ వాయిదాల పద్ధతిలో
లయబద్ధంగా మొగుడ్ని తరగటం
ఆఫీసులు హడావుడిగా బస్సులు తొడుక్కుని
కర్తవ్యం నుంచి దూరంగా పరారై
పరాన్నభుక్కులుగా మారిపోవటం అనివార్యమవుతుంది

చూపుల కాలుష్యం సోకి
అందగత్తెలు మాసిపోవటం
నర్మగర్భంగా
చర్మం మీది రంగుల్ని – శరీరం మీది పొంగుల్నీ

ప్రేమించటం మొదలై
నాగరికత ముసుగులో నయవంచన మొదలవుతుంది

ప్రకటనల పలువరుస మీది
సుతిమెత్తని సౌందర్యం సుతారంగా ఒళ్ళు విరుచుకుని
బంజారాహిల్స్ బహుసుందరంగా మెరిస్తే
బొత్తిగా సంస్కారంలేని బొచ్చుకుక్కలు
నల్లధనం వొళ్ళంతా నాకి గారాబంగా అరుస్తాయి
దారంట గరిబోడ్ని కరుస్తాయి

నిరుద్యోగ శిఖరంగా తేరుకున్న విశ్వవిద్యాలయం
అప్పుడే  విద్యార్థుల చేతుల్లో పుస్తకాలు పూస్తూ
భగ్న ప్రేమలు వీస్తూ
సందర్శకుల నాకర్షిస్తుంది

బ్రిటిష్‌వాడు వెళ్తూ వెళ్తూ అందమైన కుబుసమొకటి
వొదిలేస్తే
మాతృభాష మీది మమకారం సన్నగిల్లి
రోజురోజుకి పరభాషా వ్యామోహం పెచ్చరిల్లి
ఎబిసిడిలు తడబడుతున్న బుజ్జిగాడు కాన్వెంట్‌లో చేరి
త్వరత్వరగా తరగతులు మారుస్తుంటాడు

గొప్పింటి బిడ్డలు ఇంగ్లీష్‌ను ఐస్‌క్రీంగా చప్పరించటం
మధ్యతరగతి పెదవులు మధురంగా ఉచ్ఛరించటం
మొదలై

దరిద్ర భారతపౌరునికి ఆంగ్లాక్షరం
అందని ద్రాక్షగానే మిగిలిపోతుంది

ఎమ్‌సెట్‌ల మీంచి ఎక్కేవాడు ఎక్కటం పడేవాడు
పడటం
వంతుల వారీగా ప్రతిభావంతులు పైరవీలకు
హాజరుకావటం
దొడ్డిదారిన డొనేషన్‌లు దండుకుని
లాభాలు వండేవాడు వండుతూనే వుంటాడు

మూలిగే కోట్లు
కొత్త మోసాలు తెరవడానికి తహతహలాడితే
మూలిగే నక్కమీద
మళ్లీ టాటా బిర్లాలే పడతారు

ఎక్కడో చెట్టుక్రింది బడికి వెళ్ళనని మొరాయించే
పిల్లవాని చెంపే ఛెళ్ళుమంటుంది
చెడ్డీ చిరిగిపోతుంది
పలక పగిలి పోతుంది
ఆగి ఆగి ఏడిచే ఆ వెక్కిళ్ళే అఆఇఈ లై
అప్రయత్నంగా అబ్బాయికి చదువబ్బుతుంది

నీతి సూత్రాలకి కొలబద్దలు సరిహద్దులు చెరిగిపోయి
ప్రేమను చీల్చి శరీరంను కాంక్షించటం
ఆభరణాలు వొలిచేసుకుని ఆత్మసౌందర్యాన్ని
వొదిలెయ్యడం
శుభలేఖలు శాపగ్రస్తమై
కలల ఇంద్రధనుస్సు కనుపాపల్లోనే కరిగిపోయి
కళ్యాణమంటపాల మంటల్లో చిక్కుకుని
కన్నీళ్లు బూడిదవ్వటం
సర్వసాధారణ దృశ్యమవుతుంది

మహిళా సంఘాలు నడుం బిగించక ముందే
దేశద్రోహి అమ్మపాలు అమ్మకానికి పెడతాడు
మానభంగాలు, లైంగికదోపిడి, వరకట్నపు చావులు
అత్యాచారాల మధ్య
మిగిలిన స్త్రీజాతి అవశేషాలే
మళ్లీ మగజన్మని ప్రసాదించడానికి ఉవ్విళ్ళూరుతాయి

ఏడేడు నెత్తుటి మడుగుల సాక్షిగా
బాంబుల అతిథిగృహంలో
బ్యాలెట్‌పెట్టెల హారతులు పట్టి
ఓట్ల అక్షింతలు చల్లుతూనే
వైభవోపేతంగా వాగ్దానాల షామియానా కింద

ఎన్నికల పెళ్ళి జరిగి
కుంభకోణం ఇంద్రభవనానికి బోఫార్స్ పెట్టుపోతలతో
పెళ్ళికూతురు ఘనంగా అరాచకం అత్తారింటికి తరలి
పోతుంది
ప్రతిపక్షాల ఆడపడుచులు ప్రజల దుఃఖాన్ని అరువు
తీసుకుని
అదే పనిగా రోదిస్తాయి.

పేదరికం భుజాలెక్కి
నిటారుగా నిఖార్సయిన అంతస్తులు వెలుస్తాయి
గిటారు మీద పాశ్చాత్య సంగీతం వినిపించడం మొదలై
నాగరికత గీటురాళ్ళుగా ఫైవ్‌స్టార్ హోటళ్లు మెరుస్తాయి

షోరూం అందంగా పడగ విప్పుకుంటుంది
స్టెతస్కోప్ రక్తం పీలుస్తుంది
నల్లకోటు న్యాయం కొల్లగొడుతుంది
సిమెంట్ ఇసుకతో లాలూచి పడుతుంది
స్విమ్మింగ్‌పూల్లో సుందరీమణి ఈదులాడుతుంది

రక్తకణం అసహజంగా మెరుస్తుంది
యుక్తవయస్సు పేకముక్కల్లో కలుస్తుంది
పెళ్ళికాని ప్రియురాలి చెక్కిలి మీద
రౌడీలు తొక్కిసలాడి
జీవితం భయంకరంగా చెరిగిపోతుంది

చంద్రగుప్తులూ, మౌర్యులూ, శాతవాహనులూ
అంతరించి
చంద్రుడి చాటున మబ్బులే మళ్ళీ రాజకీయాలు
దోబూచులాడి
ప్రజల ప్రాణాలు తీస్తాయి
కాషాయం చెలరేగి రూళ్లకర్ర విరిగిపోతుంది
భక్తి పారవశ్యంతో రామశిలలు ఉప్పొంగి
రిజర్వేషన్ని రెండుగా చీలుస్తాయి
ధర్మం నాలుగుపాదాల నడుస్తూనే
చార్మినార్ చర్మం ఊడి మతం మళ్ళీ నెత్తురోడుతుంది
భయాన్ని పొదివి పట్టుకున్న పసిబిడ్డ
ఖండఖండాలుగా నరకబడ్డ చుండూరు
భరతఖండంలో నిశ్శబ్దంగా ఉండిపోతుంది

ముళ్ళకంచె వీడదు
మైలురాయి అందదు
పట్టపగలు చీకటి చిందకుండానే
నక్షత్రాన్ని హత్యచేసి శత్రువు పారిపోతాడు
రాజకీయం ఒరలో రౌడీ రహస్యంగా ఇమిడిపోతాడు
జాలీనోటు లాంటి మోసం
కాసేపు జనంలోనే చెల్లి పోతుంది.

# నాకు నమ్మకం లేదు

ప్రేయసి కళ్ళలో కాగుతున్న ప్రేమదీపాల్ని
వెలుతుర్లో చుంబించకుండా
తేనెపట్టులాటి తలకట్టు పటుత్వాన్ని చూడకుండా
తన్మయత్వం పొందే శృంగార పురుషుల మీదా
నవలల మీదా
శోభనం రాత్రుల మీదా
మానసిక అంగవైకల్యాల మీదా
మధురోహల మీదా
తనచుట్టూ తాను తిరిగే తాత్విక విశ్లేషణల మీదా
ఫిలింసొసైటీల హిపోక్రసీల మీదా
లైన్స్‌క్లబ్బుల మీదా కాబరేడాన్సుల మీదా
టాటా వారి సబ్బుల మీదా
పోటా పోటీలు పడే ప్రకటనల మీదా
నాకు నమ్మకం లేదు
చిక్కిశల్యమైన పద్యాలమీదా
చిలుకలు కొరుక్కుతినే అవార్డుల మీద
చిక్కని అజంతా శిల్పాల మీద
చితాభస్మంలో కలిసిన పని చైతన్యం రేణువుల మీదా
నాకు నమ్మకం లేదు
సూర్యకిరణాల్ని త్రోసిపుచ్చే ఆరోపణల ఆకాశాల మీదా

మిణుగుర్లను కాలరాసే కాంతి ప్రవచనాల మీదా
నాకు నమ్మకం లేదు
ప్రజల కళ్లల్లో కాగుతున్న కాగడాల్ని
వెలిగించుకోకుండానే
కోటని ముట్టడించకుండానే
పెట్టుబడుల బలిసిన భాండాగారాలన్ని
కొల్లగొట్టకుండానే
కుబేరుడు దులిపే సిరాచుక్కల మీదా
సెక్స్‌గిలిగింతలు గుప్పే పత్రికల మీదా
సినిమాంగాలు భక్షించే జాతికుక్కల మీదా
పాము కోరల్లో చిక్కుకొన్న పత్రికల్లోని
పాత్రికేయ వృత్తిమీదా
కత్తిమీద మూగవోయిన కర్తవ్యం గొంతుమీద
నాకు నమ్మకం లేదు
ప్రభుత్వ లాంఛనాలతో తరలిపోతున్న
శవాల మీదా
శాలువాలమీద జాలు వారిన శవకవి సమ్మేళనాల మీదా
విధ్వంసం వేలికొనల్లో స్తంభించిన
విశ్వవిద్యాలయాల మీదా
నిలిచిపోయిన విద్యార్థుల వర్తమానం మీదా
నాకు నమ్మకం లేదు

# పర్సనల్ (?) పోయమ్

తెర వెనక లీలగా
మృత్యువు కదలాడినట్టు
తెరలు తెరలుగా దగ్గొస్తుంది.
తెగిన తీగెలు సవరించడానికన్నట్టు
గబగబా పరుగెత్తుకొచ్చి నా భాగ్యం
గ్లాసుడు నీళ్ళందిస్తుంది.

అందరికీ సుఖం కోరిన కలల్లోకి
వ్యాధులు ప్రబలి పోయినట్టు
రోజు రోజుకీ నా గడ్డం మాసిపోయి
మున్సిపాల్టీ వాళ్ళెత్తని చెత్తలా
విలేఖరుల కంట పడని వార్తలా
నెత్తిమీద నా జుత్తు పెరిగిపోతూ వుంటుంది.
అప్పుడప్పుడూ
అనుమానాస్పదంగా
నన్నునేను పోల్చుకుంటానో లేదోనని
అద్దంలో చూసుకొని
అచ్చు అలిశెట్టి ప్రభాకర్‌నే అనిపించి
సంతృప్తిగా నవ్వుకుంటాను.

కిరసనాయిల్లేదురా మొగుడా అంటే
కవిత్వం రాస్తు కూచున్నాడని
నా అర్ధాంగి అందంగా
గొణుక్కుంటుంటే
అప్పటికప్పుడు ఆమె ముఖంలోకి చూస్తూ
నేను సౌందర్యారాధకుడ్నై పోతాను.

బారెడు పొద్దెక్కి
బారుషాపులు తెరిచి సగం సరుకమ్ముడు పోయినా
బంగాళాఖాతంలో వాయుగుండం
ఏర్పడిందని తెలిసినా
ఒళ్ళునొప్పులు తప్ప
నాకింకా తెల్లారిచావదు.

పవనో ప్రవీణో
ఉదయో పద్మాకరో
శ్రీనో అశోకో
వచ్చి భుజం తట్టేదాకా
నాకు వణుకు తగ్గదు.
డ్రైవర్ని వెదుక్కుంటూ
తప్పిపోయిన కారులా
నందిగం కృష్ణారావొస్తాడు

తను కొత్తగా చేస్తున్న కేసుల్లో
ఎవడెంత ఎగ్గొట్టాడో లెక్కలు చెబుతాడు.

రాయని లాంగ్‌పోయమ్‌లా
జింబో వస్తాడు
సాహిత్యంలో స్పృహతప్పిన
తెలుగు సాహిత్యాచార్యుడో
మొదలు పెట్టని సినిమాలా
మెహర్బానో
పూర్తికాని కవితలా
ఇంజనీరు కవి శివకూమారో వస్తాడు.

ఘల్లున గచ్చుమీద రూపాయి
బిళ్ళ మోగినట్టు
నిజాం వెంకటేశం వస్తాడు
నన్నూ నా రోగాన్ని మందుల్నీ కవిత్వాన్నీ
కవుల్నీ తిట్టిన తిట్టు తిట్టకుండా
కసితీరా తిట్టి
మధ్యలో రూటు మార్చి
మహాశ్వేతాదేవిని మెచ్చుకొని
తరచుగా సాహిత్య సభల్లో పాల్గొన
లేనందుకు నొచ్చుకొని
నాకో వందిచ్చుకొని మరీ నిష్క్రమిస్తాడు.

## ఈ ప్రశ్నకు జవాబు

మైలురాళ్లని భూస్థాపితం చేస్తావ్
మరి గమ్యాన్నేం చేస్తావ్
తుపాకుల్తో నియంతృత్వపు సరిహద్దు రేఖల్ని నిర్మిస్తావ్
యుద్ధ శకటాలవుతున్న మానవ శరీరాల్నేం చేస్తావ్
చిత్రహింసల చీకటికొట్లని తెరచి రాజ్యహింసను
రాజేస్తావ్
అణువిస్ఫోటనంగా మారుతున్న ఆకలి కణాల్నేం చేస్తావ్
అన్నిటినీ మించి
మృత్యుఫలకమ్మీద మెరుస్తున్న
నీ ముఖకవళికల్నెలా దాస్తావ్

## స్వాగత గీతిక

సంకెళ్లే స్వేచ్ఛయిన
స్వాతంత్ర్యం పరిభాషలో

అరాచకమే అధికారమై
ప్రబలుతున్న రాజ్యంలో

అరణ్యాల్ని
ఆయుధాలుగా ధరించి
సంధించినా

త్యాగాల తోరణాల్తో
ఉద్యమ ద్వారాలు
తెరిపించినా
కాలమే స్వాగత గీతికౌతుంది
పీడితుడి పక్షమై గెలుస్తుంది

## భాగ్యలక్ష్మి

నాకు బెర్నార్డ్‌షాలు, షేక్స్పియర్‌లూ తెలియదు
తనకు గుడిపాటి వెంకటాచలం, గురజాడా తెలియదు
ఇద్దరం ఉత్త పిచ్చివాళ్లం
కాని–
అడుగంటిన కిరసనాయిలు స్టవ్‌తో
అన్నం ఎట్లా ఉడికించాలో తనకు తెలుసు
దగ్గు తెరల నెత్తుటి రెపరెపల ఊపిరితిత్తుల్తో
కవిత్వమెట్లా రాజేయాలో నాకు తెలుసు
ఇద్దరం కలిసి ఒక కలగా
కలగాపులగంగా కలిసిపోయిన రోజుల్లో
ఇంచుమించు ఒకే కంచంలో
ఇంద్రధనుస్సుల్ని తుంచుకొని తిన్నరోజుల్లో
మా గుండెల్లో సమస్యలు మండని రోజుల్లో
సిగరెట్ పీకలాంటి నన్ను
సిగలో పువ్వులా తురుముకొని

గాజుకుప్పెల్లాంటి నా కళ్లలోనే
ఆశల అగరొత్తులు వెలిగించుకుందే తప్ప
తులతూగే ఐశ్వర్యమో
తులం బంగారమో కావాలని
ఏనాడూ ప్రాధేయపడలేదు.

## విప్లవాభివందనం

అన్నం ముద్దలాంటి
ఆశయాన్ని
అందరం కలిసే
పంచుకుందాం

యుద్ధరంగమైన
జీవితాన్ని
ఒక్కటిగానే
ఎంచుకుందాం

ఎర్రెర్రగా
విచ్చుకునే కళ్లకి
ఎదురొడ్డి
నిలిచే నా వాళ్లకి
విప్లవాభి వందనం.

## లం‘పెన్’

అనేకానేక లం‘పెన్’లూ
క్షుద్రసాహిత్య గూండాలూ
నెలకొన్న రాజ్యంలో
నే నక్షరాలకు
గెరిల్లా శిక్షణిస్తా!

## పదునెక్కే రైతు కూలి

కొడవలిలా
వంగి
పదునెక్కుతున్నాడు
ప్రతిరైతు కూలీ
తుపాకిలా
నిలబడి
నువ్వింక
ఆజ్ఞాపించలేవురా
పెత్తందారూ

## ట్రిగ్గర్

తిన్నగా
తుపాకీ గొట్టంమీదుగా
నడిచొస్తే
కనిపిస్తోందొక
ట్రిగ్గర్

సరాసరి
శత్రువు గుండెల పైకి
గురిపెట్టబడిన
బాట మీదుగా
పయనిస్తే
కనిపిస్తాడొక
*గద్దర్!*

## పాట

రాడికల్స్‌ని
గద్దలా
తన్నుకుపొయ్యే
ప్రభుత్వం
రారమ్మని
గద్దర్ని
ఆహ్వానిస్తోంది
ఎందుకో
అతని పాటిపుడు
ముద్దొస్తుందా...!?

## నిషేధం?

సలసలా
కాగుతున్న
ఆకలి సెగల్ని
చల్లార్చ లేనివాడు

ఆకాశంలో ఎరుపునీ
అగ్ని పర్వతంలోని లావానీ
ఎలా నిషేధించగలడు.

## బూటకం

శ్రీశ్రీ, గోర్కీ, చలమనే
తీవ్రవాద సాహిత్యం
పిల్లవాళ్లు ఆడుకునే
రెండు బొమ్మ పిస్తోళ్లు
ఖచ్చితంగా మా ఇంట్లో
కలిగుంటాం గనుక
ఏ క్షణంలోనైనా
ఎదరు కాల్పుల్లో
మరణించేందుకు
నేనూ అర్హుణ్ణే...?!

## జాతీయగీతం

గొంతెత్తి
పాడుకో....
సారావేలం పాటలే
జాతి జనుల గీతాలు

తుపాకీ బాయ్‌నెట్లతో
దున్నుకో....
పారా మిలిటరీ దళాలే
పారే నదీ జలాలు!!

## ప్రభుత్వహస్తం

గుర్తు తెలియని తీవ్రవాది
మరణం వెనుక
కారణం ఏమైనా
ప్రమోషన్లుంటాయి
ప్రభుత్వాల అభయ హస్తాలుంటాయి
తమ్ముడూ గప్‌చుప్!

## లెక్క

ఒక నక్సలైట్‌ని
చుట్టుముట్టి కాల్చేయడానికి
వందమంది పోలీసులు అవసరమైతే
నిష్పత్తి అనుపాతం
లెక్కల ప్రకారం
ఆరుగుర్ని తుదముట్టించేందుకు

ఆరువందల మంది సాయుధ
రిజర్వ్‌దళం
అత్యవసరమే...
గుణితం కరక్టే...

## నిజం

పోలీసుల
తుపాకీ గొట్టాలు
దులిపితే
రాలిపడే వన్నీ
బూటకపు
ఎదురుకాల్పులే

## తిప్పాపూర్

తుపాకీ గొట్టంమీద
ప్రమాణం చేసి
పట్టపగలు
మనుషుల్ని పిట్టల్లా
కాల్చేయ గలనని
చెప్పు!
ఆ పిదపే తిప్పాపూర్....

## రాముడే కీలుబొమ్మ

ఈ నెత్తుటి ధార
ఎందాక ప్రవహిస్తుందో
ఎవరికి తెలుసు
ఈ కత్తుల వంతెన
ఎందాక విస్తరిస్తుందో
ఎవరికి తెలుసు
ఆయోధ్య
రాజకీయాల చితిలో
రాముడే కీలుబొమ్మ

## దోమ

"దోమా దోమా
రాత్రంతా నన్నెందుకని
కుట్టలేదు?"
"నీ ఒంట్లో రక్తం లేదని!"
"మరెవరు పీల్చేశారు?"
"మీ మనుషులే!"

## విప్లవ సౌందర్యం

కొడవలి
కడలి తరంగమై
ఉప్పొంగినపుడు

అడవి
ఆకుపచ్చదీపమై
వీరులకి
వెలుగిచ్చినపుడు
నేలమాళిగలోదాగి
భూకంపం
కన్పించినపుడు
తిరుగుబాటు సత్యం
చాటకుండా ఉండకు
విప్లవసౌందర్యం
ఆవిష్కరించకుండా వెళ్లకు

## ఆరంభ సూచకం

విశ్వవిద్యాలయాల
వధ్యశిలపై
శిరసుమోపిన విద్యార్థీ

వివాహవేదికల
సమాధుల్లోకి
కూరుకుపోయ్యే అభాగిని

వెట్టిచాకిరీ చట్రంలో
వసివాడిన
ఒక పసివాడూ పనివాడూ

దిగంతాల అంచుల వరకూ
వ్యాపించిన
పీడితులెవరైతేనేం
పగిలిన గాజులాంటి
పదునైన చూపొకటి
ఈ వ్యవస్థ పైకెక్కుపెడితే
అదేరా... ఆరంభసూచకం

## ప్రతిఘటనా కెరటం

విప్లవోద్యమంగా
వికసిస్తున్న
శరీరం శరీరమంతా
నేనే అయినప్పుడు

విస్ఫోటన చెందే
ప్రతి రక్తకణమూ
నాదే అయినప్పుడు

శత్రుకూటమిని
తుత్తునియలు గావిస్తున్న
సామూహిక శక్తే
నేనై విజృంభిస్తున్నప్పుడు
తాత్కాలిక పరాజయాలకి
ప్రతీకగా
ఒక చెయ్యి తెగిపడితేనేం
ప్రతిఘటనా కెరటంగా
మరో చెయ్యి
ఉప్పొంగే తీరుతుంది.

## హృదయత్రాసు

తెరవెనుక మృత్యువు
లీలగా కదలాడినట్టు
తెరలు తెరలుగా దగ్గు
గుండెల్ని పిండేస్తుంటే

తెగిన తీగలు
సవరించడానికన్నట్టు

తెల్లవార్లూ పరిచర్యలు చేసే
నా భాగ్యమే

నా కన్నీళ్లని తూచే
సున్నితపు హృదయత్రాసు

నేను
ఆమె నిశ్శబ్దపు వేదనా తరంగాల్ని
కొలిచే భారమితిని.



alisetti prabhakar kavitha

అతడొక కవిత్వ మాంత్రికుడు.

కుంచెని, కెమెరా లెన్సుని, కలాన్ని ఏకం చేసి తెలుగు కవితకు పుష్టి చేకూర్చాడు. రెండు దశాబ్దాల కింద మూగబోయిందతని శరీరం. కానీ కవిత్వం మాత్రం గోడలపై నినాదాలై, వ్యాసాలకు మొదలు తుదలై, ప్రజల నోటి నుడికారమై మన మధ్యే తచ్చాడుతున్నది.

శ్రీశ్రీ తరువాత అంత ఎక్కువగా 'కోట్' అయిన కవిత్వం ప్రభాకర్‌దే. వర్తమాన కవిత్వానికి 'కాయినేజ్' పెంచిన కవీ ఇతనే. రూపంలో సంక్షిప్తతనీ, వస్తువులో జీవిత విస్తృతినీ, సమాజపు లోతుల్నీ ఇమిడ్చాడు. సమాజ మార్పుని ఆకాంక్షిస్తూ పేదరికానికి బలైన కవి. 'మరణం నా చివరి చరణం' కాదని, సమరమే తన అంతిమ చిరునామా అని ప్రకటించాడు. రోజు రోజుకీ అతని కవిత్వానికి రెలవెన్స్ పెరుగుతోంది. అందుకే ఈ ప్రచురణ!

-జయధీర్ తిరుమలరావు



నవతెలంగాణ పబ్లిషింగ్ హౌస్